

# నేడే చూడండి

శ్రీ తిరుమలా పిక్చర్స్ వారి

# వరప్రతిజ్ఞ

మాటలు-పాటలు... అనిసెట్టి
దర్శకత్వం... జి. ఆర్. నాథన్
సంగీతం... టి. జి. లింగప్ప - వేలూరి
కూర్పు... బి. గోపాలరావు

సీడెడ్: జ్యోతి ఫిలిమ్స్

ఆంధ్ర: రాయల ఫిలిమ్స్ రిలీజ్..

నిర్మాతలు... ఎ. శ్రీరామమూర్తి, వి. ఎస్. సత్యనారాయణ






అడుగడుగున ఆటంకాలు ఎదురయ్యే జీవిత
చదరంగంలో గెలిచినవాడే మొనగాడు! ఎవరా
మొనగాడు, ఏమా కథ?.. చూడండి!

యస్.వి.ఆర్. ఫిలిమ్స

# చదరంగం

దర్శకత్వం యస్.వి.రంగారావు

అసోసియేట్ డైరెక్టర్: కె.వి.నందనరావు

కథ-మాటలు. డి.వి.నరసరాజు B.A.

పాటలు: దాశరధి

సంగీతం: టి.వి.రాజు

కెమెరా: చంద్రశేఖర్

నిర్మాత:
బడేటి సత్యనారాయణ B.A.

నిర్వహణ:
పుట్టా వెంకట్రావు

పూర్ణా రిలీజ్

NAVRANG

# ఉత్తరాలు

### బీహార్, ఉత్తరప్రదేశ కరువునివారణకు విరివిగా సహాయం చేయాలి.

నేడు బీహారులో, ఉత్తరప్రదేశ్ రాష్ట్రములో ప్రజలు భీకర కరువుకు గురియై అమానుషమైన బాధలు అనుభవించడం, ఆ బాధలు రోజురోజుకూ హృదయ విదారకంగా వుండడం మానవ హృదయాలను కంపింప జేయుచున్నవి. అక్కడ ప్రజానీకం జీర్ణ శల్యాలుగా, చావుకు మొగంవాచివున్న సజీవ కళేబరాలుగా వున్నవని వస్తున్న వార్తలు హృదయాలను కృంగదీస్తున్నవి. ఈ అదనులో విపత్తులో తోటి మానవులు తమయోపిన విధంగా ఆదుకోవడం అందరి విధి. ఆంధ్ర ప్రజానీకం ఇట్టి ఆపదలలో ఎల్లప్పుడూ ముందుండి తమ మానవ ధర్మాన్ని నిలబెట్టుచున్నది. ఇప్పుడు కూడా ఆ విధంగా ముందుకువచ్చి వస్తు రూపేణా, ధాన్య రూపేణా, మందుల రూపంలో వస్త్ర రూపేణా ఆర్తిలోవున్న తోటి మానవులకు సహాయం చేయుటకు ముందుకు రావాలి. ఆ రెండు రాష్ట్రములలో ముఖ్య మంత్రుల నిధులు ప్రారంభించారు. భారత ప్రధాని నిధి ప్రత్యేకంగా ప్రారంభించారు. ఇచటనుండి పంపే విరాళాలు పంపువారికి పోస్టులోను, రైల్వేలోను ఉచిత సౌకర్యాలు కూడ కలిగించబడి వున్నవి. దయార్ద్ర హృదయులు ధాన్యాన్ని, ద్రవ్యాన్ని, మందులను, వస్త్రాలను వసూలుచేసి ఆ నిధులకు పంపి సహాయపడ ప్రార్థితులు. ఆంధ్రప్రదేశ్ మొత్తంగా యీ సహాయక ఉద్యమం పెద్దఎత్తుతో సాగించవలసివుంది. అందుకు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని సంస్థలు, రాజకీయపార్టీలు సమైక్యసంఘాలు ఏర్పరచి ప్రజలలో ప్రబోధంచేసి ప్రజలలో అణగి యున్న సహాయ కార్యక్రమముల ఆకాంక్షను ఒక రూపంలో పెద్దఎత్తున బాధలోవున్న జనానికి సహాయము అందే ప్రయత్నం చేయవలెనని అభ్యర్థించుచున్నాను.

వావిలాల గోపాలకృష్ణయ్య

### కవితా సంకలనము

రచయితలు తమ అమూల్యమైన కవితలను పంపి మేము వెలువరించదలచిన కవితా సంకలనము ప్రచురణకు సహకరించవలసినదిగా కోరుచున్నాము.

ఉత్తమ కవితకు రు. 50 లు బహుమతి యివ్వబడుతుంది. రచయితలు యీ అవకాశమును వినియోగించుకొందురని ఆశిస్తున్నాము. పూర్తి వివరములకు ఈ క్రింది చిరునామాకు వ్రాసిపొందవచ్చును.

అల్లెన బాలకృష్ణారావు,
కార్యదర్శి
నవసాహితి సమితి, పాలకొండ, శ్రీకాకుళంజిల్లా.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 26-5-'67

ప్లవంగనామ సం॥ వైశాఖమాసం బహుళ తదియ

సంపుటము : **59** సంచిక : **37**

స్థాపితము

**1908**

ముఖ్య సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము

**7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1**

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు

ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : గౌతమబుద్ధుడు

చిత్రకారుడు : గెనిసెట్టి.





# దేశోద్ధారక శతజయంతి



ఆంధ్రరాజధానీనగరంలో కొత్తగా నిర్మించే విద్యామందిరానికి విశ్వదాత పేరు పెట్టడానికి, దేశోద్ధారకుని పెద్ద విగ్రహాన్నొకదాన్ని విజయవాడలో స్థాపించడానికి, రాష్ట్రవ్యాప్తంగా శతజయంతి ఉత్సవాలను వైభవంగా జరపడానికి దేశోద్ధారక శతజయంతి ఉత్సవసంఘం ఈనెల 5 వ తేదీన హైదరాబాద్‌లోని ఆనందనిలయంలో సమావేశమై నిర్ణయాలు చేసింది.

దేశోద్ధారక శతజయంతి ఉత్సవ సంఘానికి అధ్యక్షులు ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, సంఘ సమావేశకర్త ప్రభుత్వ సమాచారశాఖ డైరెక్టర్ శ్రీ బి. ఆర్. కె. శాస్త్రి. ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ కాకాని వెంకటరత్నం, మాజీమంత్రి, శాసనసభ్యులు అయిన శ్రీ వేముల కూర్మయ్య, విశాలాంధ్ర పత్రికా సంపాదకులు శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావు, శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథం, గౌతు లచ్చన్న, శివలెంక రాధాకృష్ణ ఈ సంఘంలో సభ్యులు.

శతజయంతి ఉత్సవాలను ఎలా జరిపితే బాగుంటుందో ప్రజలు సూచించవలసిందిగా శ్రీ బి. ఆర్. కె. శాస్త్రి విజ్ఞప్తి చేశారు. రాష్ట్ర వ్యాప్తంగా ఉత్సవాలు వైభవోపేతంగా జరిపించడానికి లక్షరూపాయలు నిధిని సేకరించడానికి సంఘం తీర్మానించింది.

దేశోద్ధారకుని ఎడల ప్రజలు తమకు గల అభిమానాన్ని వ్యక్తపరుస్తూ విరాళాలు పంపవలసినదిగా శ్రీ బి. ఆర్. కె. శాస్త్రి విజ్ఞప్తి చేశారు. ఈ నిధికి ముఖ్యమంత్రి రు. 501, శ్రీ కాకాని వెంకటరత్నం రు. 250, శ్రీ వేముల కూర్మయ్య రు. 116, శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావు రు. 116 లు విరాళంగా యిచ్చారు.

దేశోద్ధారక శతజయంతి ఉత్సవ సందర్భంగా భారతప్రభుత్వం ఒక తపాలాబిళ్లను ఆయన మూర్తితో ప్రచురించవలసినదని సంఘంవారు తీర్మానించారు. దీని ఔచిత్యాన్ని వివరిస్తూ ముఖ్యమంత్రి భారత తంతితపాలా మంత్రి శ్రీ రామ్ సుభాగ్ సింగ్‌కి ఒక లేఖ రాశారు.

శ్రీ కాకాని వెంకటరత్నం, శ్రీ యన్. జి.

రంగా ప్రభృతులు శతజయంతి ఉత్సవాలను వైభవోపేతంగా జరపవలసిందిగా విజ్ఞప్తి చేశారు.

ఆంధ్ర పత్రికారచయితల సంఘం ఆధ్వర్యాన ఈనెల ఆరవతేదీన శ్రీ జె. వి.నరసింగ రావు అధ్యక్షతన జరిగిన తొలి సభలో శ్రీయుతులు ఏ. బి. రాజా, కె వి నరసింహారావు ప్రభృతులు దేశోద్ధారకుని బహుముఖమైన, మహోత్కృష్టమైన సేవను, అజరామరమైన వారి కీర్తి ప్రతిష్ఠలను స్మరిస్తూ నివాళు లర్పించారు.

ఆంధ్రజాతి సర్వతోముఖ అభ్యున్నతికి తమ సర్వస్వాన్ని ధారపోసిన ధన్యజీవి, త్యాగశీలి, పరమపూజ్యులు, మహాపురుషుడు 'దేశోద్ధారక' కళాప్రపూర్ణ, విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు అని విజయవాడలోని రామమోహన్ గ్రంథాలయంలో పౌర సంఘం అధ్వర్యాన జరిగిన శ్రీదేశోద్ధారక జయంత్యుత్సవ సభలో పలువురు ప్రముఖులు ప్రస్తుతించారు.

విజయవాడలో జరిగిన విశ్వదాత శత జయంత్యుత్సవసభలో దేశోద్ధారకుని ఆశయ సాధన దేశప్రజల పవిత్ర కర్తవ్యం అని, పంతులుగారు ఆంధ్రాభ్యున్నతికి చేసిన అమూల్యమైనసేవ నుగ్గడిస్తూ పలువురు వక్తలు ప్రసంగించారు.

నరసరావుపేటలో శ్రీ పసుపులేటి రామ కోటయ్య అధ్యక్షతన జరిగిన దేశోద్ధారక శతజయంతి ఉత్సవంలో పంతులుగారు ఆంధ్రదేశ సర్వతోముఖాభివృద్ధికి సల్పిన కృషిని, వారి బహుముఖ సేవలను, జీవిత విశేషములను వివరిస్తూ అధ్యక్షులు ముచ్చటించారు. పంతులుగారి గుణగణములను, మానవాళికి వారుచేసిన బహుముఖసేవను ప్రస్తుతించారు. అధ్యక్షులచే సభలో ప్రవేశపెట్టబడిన తీర్మానాన్ని, పంతులుగారి ఆత్మజ్యోతికి సదా శాంతి కలుగుగాకయని నివాళు లర్పిస్తూ మూడునిముషముల మౌనమును పాటించి, ఏకగ్రీవంగా ఆమోదించారు. గుంటూరు, రాజమండ్రి, కాకినాడలలో జరిగిన దేశోద్ధారక శతజయంతి ఉత్సవాలలో వారి ప్రతిభను, బహుముఖ సేవను, దాతృత్వమును, కీర్తిని కొనియాడుతూ పలువురు ప్రముఖులు ప్రసంగాలు చేశారు. ●

**న్యూఢిల్లీ లేఖ** **శ్రీకృష్ణ**

# రాష్ట్రపతిగా డాక్టర్ జాకీర్ హుస్సేన్ ఎన్నిక

డాక్టర్ జాకీర్ హుస్సేన్ తన ప్రత్యర్థి శ్రీ సుబ్బారావుని లక్ష పైచిలుకు మెజారిటీతో ఓడించి భారత రాష్ట్రపతిగా ఎన్నికైనారు. ఇది శ్రీమతి గాంధీగారి వ్యక్తిగత విజయం. మత ప్రసక్తి రాహిత్యాన్ని గూర్చి ఆమె తండ్రి కీర్తిశేషులైన పండిట్ జవహర్ లాల్ నెహ్రూ మాట్లాడేవారు కాని శ్రీమతి గాంధీ దాన్ని ఆచరణపూర్వకంగా చూపించారు. ముసల్మాన్ రాష్ట్రపతి అయ్యారు. విదేశీ వ్యవహారాల మంత్రి శ్రీ చాగ్లా ముసల్మానే. పరిశ్రమల అభివృద్ధి శాఖామాత్యులు శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ కూడా ముసల్మానే. ఇక రక్షణశాఖ మంత్రి సర్దార్ స్వరణ్ సింగ్ సిక్కు. ఆహార వ్యవసాయశాఖామాత్యులు శ్రీ బాబూ జగ్‌జీవన్ రామ్ షెడ్యూల్డు కులం. అడ్వకేట్ జనరల్ శ్రీ దఫ్తరి పార్సీ వ్యక్తి. పోతే ఇక భారత ప్రధాన న్యాయమూర్తి పదవికి ఈ సంవత్సరాంతానికి ప్రస్తుతం ఉన్న శ్రీ వాంఛూ స్థానే శ్రీ హిదయతుల్లా వస్తారు. దేశంలో అధిక సంఖ్యాకులుగా ఉన్న జాతి, అంటే హిందువులకు, భారత జాతీయ పతాకంలో ప్రాతినిధ్యం లేదు. ముసల్మానులు, సిక్కులు ఇతరులకే ప్రాతినిధ్యం ఉన్నది. కేంద్రంలో ఉన్న కార్యనిర్వాహక, న్యాయశాఖ అన్న రెండు రంగాలు ముసల్మానుల చేతి క్రిందకి వస్తాయి. రక్షణదళాల సుప్రీమ్ కమాండర్ ముసల్మాన్, రక్షణమంత్రి సిక్కు.

డాక్టర్ రామ్‌సుభగ్ సింగ్ తీసుకున్న జాగ్రత్తలవల్ల పార్లమెంట్‌లోని కాంగ్రెస్ సభ్యులందరూ డాక్టర్ జాకీర్ హుస్సేన్‌కి ఓటు చేయటంవల్ల ఆయనకు బ్రహ్మాండమైన మెజారిటీ వచ్చింది. కాంగ్రెస్ సభ్యులంతా మూక ఉమ్మడిగా ఓటు చేయటం వల్లనే యిది సాధ్యపడింది. పార్లమెంట్‌లో కాంగ్రెస్ సభ్యులు మొత్తం 445 మంది ఉన్నారు. అందులో ఇద్దరు దేశంలో లేరు. ఎలక్టోరల్ కాలేజ్ పార్లమెంట్ విభాగంలో డాక్టర్ జాకీర్ హుస్సేన్‌కి 447 ఓట్లు వచ్చాయి. అంటే నలుగురు కాంగ్రెసేతర సభ్యులు ఆయనకు ఓటు చేశారన్న మాట. అందులో అధికపక్షం ముసల్మాన్‌లే అయి ఉండవచ్చు. ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, మధ్యప్రదేశ్ లలో కొందరు కాంగ్రెస్‌సభ్యులు శ్రీ సుబ్బారావుకి ఓటు చేశారు. మిగతా అన్ని శాసన సభలలోను, ముఖ్యంగా కేరళ, మద్రాసు లలో మొత్తం ముసల్మాన్ లందరూ డాక్టర్ జాకీర్ హుస్సేన్‌కి ఓటుచేశారు. పంజాబ్‌లోని అకాలీ సిక్కులుకూడా అదేవిధంగా చేశారు.

శ్రీమతి గాంధీ సాధించిన ఘనవిజయం ప్రయోజనం ఎంత, డాక్టర్ జాకీర్ హుస్సేన్‌గారి రాష్ట్రపతి అధికారంలో భారతదేశానికి ముఖ్యంగా ముసల్మానులకు వచ్చే ఉపయోగాలేమిటి? కాశ్మీర్ సమస్య పరిష్కారం ప్రస్తుతం సులభ సాధ్యమవుతుందా లేక పాకిస్థాన్‌తో సంబంధాలు చక్కబడతాయా?

ఈ లేఖ రాసే సమయానికి పాకిస్థాన్ పత్రికలు ఏమంటున్నాయో తెలియలేదు కానీ ఇక్కడఉన్న పాకిస్థాన్ పక్షాలు మాత్రం చాలా కాలంపాటు కాంగ్రెస్ అధ్యక్షుడుగా పనిచేసిన కీర్తిశేషులైన మౌలానా అజాద్ సంగతి గుర్తుకి తెస్తున్నారు. మౌలానా అజాద్ హిందూ — ముస్లిమ్ సమస్యను పరిష్కరించలేక పోయారు. భారతదేశ విభజనని అరికట్టలేక పోయారు. వాస్తవం యేమిటంటే జాతీయస్థాయిలోని ముసల్మాన్ లంతా ఒకరకమైన భద్రపరుపబడిన, రక్షణ కల్పింపబడిన శిల్పాల్లా తయారయ్యారు. వారికి ప్రదర్శనే తప్ప ప్రయోజనంలేదు. కాని భరించి పోషించాల్సిందే. సర్దార్ స్వరణ్ సింగ్, ఉజ్జల్

(10 వ పేజీ చూడండి)

జకీర్ హుస్సెయిన్ ఫిబ్రవరి 8, 1897న నేటి ఆంధ్రరాజధాని అయిన హైదరాబాదులో జన్మించారు. వారి పూర్వులు ఉత్తరప్రదేశ్‌లోని ఫరుకాబాద్‌కి చెందినవారు. పఠాన్ జాతివారు.

డా. జకీర్ హుస్సెయిన్ విద్యాభ్యాసంఅంతా ఉత్తరప్రదేశ్‌లోనే జరిగింది. పట్టభద్రులయిన తర్వాత అలహాబాదులోని న్యాయకళాశాలలో చదువుతూ ఉండగా మహాత్ముడి ప్రభావానికి లోనయి, చదువు మానుకున్నారు, ఉపాధ్యాయ వృత్తి ద్వారా సేవ చేసే అవకాశాలు అధికం అని నిర్ణయించుకుని వేతనం లేకుండా ఉపాధ్యాయ వృత్తి కొనసాగించారు. మొదటి నుంచీ ఆయనకి ముస్లిం లీగ్ అంటే ఇష్టంలేదు.

1922 లో గాంధిగారు తమ ఉద్యమం ఆపిన తర్వాత డా. జకీర్ హుస్సేన్ బెర్లిన్ వెళ్ళి ఎం. ఎ., పి. హెచ్.డి. డిగ్రీలు పుచ్చుకున్నారు. తర్వాత దేశానికి తిరిగివచ్చారు. అప్పటి నుంచి 1948 దాకా ఆయన గాంధిగారి జాతీయ విద్యావిధానాన్ని అమలు పరచటమే తమ ధ్యేయంగా ఎన్నుకున్నారు.

'బేసిక్ విద్యావిధానం' ఆయన కృషివల్లనే అంతర్జాతీయ ప్రసిద్ధి సంపాదించుకోగలిగింది.

1948 లో ఆయన అలీఘర్ విశ్వవిద్యాలయం వయిస్ చాన్సలర్‌గా ఎన్నికయ్యారు. విద్యాప్రపంచంలో వివిధ పదవులని ఆక్రమించారు. 1957లో బీహార్ గవర్నర్‌గా నియమితులయ్యారు. 1962 లో ఉపరాష్ట్రపతి అయ్యారు.

1954 లో 'పద్మభూషణ్', 1963 లో 'భారతరత్న' అయ్యారు. 1962 నుంచీ ఆయన ఢిల్లీ విశ్వవిద్యాలయానికి వయిస్ ఛాన్సలర్‌గా ఉంటూ వచ్చారు.

1967లో భారతదేశానికి రాష్ట్రపతి అయ్యారు.

# రాష్ట్రపతి అయిన ఉపాధ్యాయుడు

డాక్టర్ జకీర్ హుస్సెయిన్ భారత రాష్ట్రపతి పదవి పోటీకి కాంగ్రెసుపార్టీ నిలబెట్టిన అభ్యర్థి.

ఆయన మహమ్మదీయుడు.

కాంగ్రెసు వ్యతిరేక పక్షాలలో అధిక సంఖ్యాకులు నిలబెట్టిన అభ్యర్థి, మాజీ సుప్రీమ్‌కోర్టు ప్రధాన న్యాయమూర్తి, శ్రీ కోకా సుబ్బారావుని డాక్టర్ జకీర్ హుస్సెయిన్ వోడించగలడా, లేడా అన్న సందేహం కలగటానికి ఇవే ముఖ్యమయిన కారణాలు.

1967 ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ బాగా దెబ్బతిన్నది. ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెసు వ్యతిరేకపక్షాలు ప్రభుత్వాలు ఏర్పరిస్తే కాంగ్రెసు పార్టీ ఏడింటిలోనే ప్రభుత్వాలు ఏర్పరచగలిగింది (ముఖ్యమయిన రాష్ట్రాలనిమాత్రం లెఖ్ఖలోకి తీసుకుంటే.) లోకసభలో కూడా కాంగ్రెసు పార్టీకి చిన్న మెజారిటీ మాత్రమే లభించింది. ఎన్నికలలో వోడిపోయిన కొందరు కాంగ్రెసు నాయకులు రాష్ట్రపతి పదవికి అంతవరకూ ఉపరాష్ట్రపతిగా ఉంటూ వచ్చిన డాక్టర్ జకీర్ హుస్సెయిన్‌ని అభ్యర్థిగా నిలబెట్టటానికి ఇష్టపడలేదు.

వీరి వర్గాలు ఎన్నికలో ఎటు వోట్లు వేస్తాయో అనే అనుమానం కలిగేందుకు అవకాశం ఏర్పడింది.

హైందవేతర మతాలని ద్వేషించే రాజకీయపక్షాల సంగతి అటు ఉంచి, కాంగ్రెసు పార్టీలోనే మహమ్మదీయ ద్వేషం కలవారు చాలామంది ఉన్న విషయం పెద్ద రహస్యం కాదు.

రాష్ట్రపతి ఎన్నిక గురించి ఎన్నో ఊహాగానాలు జరిగాయి. కాంగ్రెసు అభ్యర్థి వోడిపోయి తీరుతాడన్న వారినుంచి, 40—50,000 'వోట్ల'తో గెలుస్తాడన్న వారిదాకా ఎన్నోరకాల అంచనాలు వేశారు.

చివరికి డక్టర్ జకీర్‌హుస్సెయిన్ 1,07,273 వోట్ల మెజారిటీతో గెలిచారు.

శాసనసభలలో, లోకసభలో ఎంతో బలహీనంగా ఉండికూడా ఈ గెలుపుని సాధించగలగటం కాంగ్రెసు పార్టీకి గర్వకారణమే. భారతదేశంలో ఉంటున్న మహమ్మదీయులందరినీ అనుమానించే కొందరు హైందవ మత దురభిమానులకి ఇది పెద్ద అపజయమే. ఒకవిధంగా చూస్తే లౌకిక (సెకులర్) సిద్ధాంతాలకి గెలుపే. కాని, కాంగ్రెసు పార్టీవారు దీనిని సిద్ధాంతాలకోసం చేసిన యుద్ధంగా పరిగణించారనుకొనటం సరికాదు. ఒక్క జనసంఘం తప్ప ప్రతిపక్షాలలో హైందవమత దురభిమానంకల పార్టీ లేదు. కేవలం కాంగ్రెసు పార్టీకి హాని చెయ్యాలనే ఉద్దేశంతోనే ప్రతిపక్షాల వారందరూ ప్రధాన న్యాయమూర్తిగా ఉంటున్న శ్రీ కోకా సుబ్బారావుగారిని తమ అభ్యర్థిగా నిలబెట్టారు. ఈ సంగతిని గుర్తించి కాంగ్రెసు పక్షంవారు కనీసం ఈ సందర్భంలో, అయికమత్యంతో వ్యవహరించారు. నేటి పరిస్థితులలో కాంగ్రెసుపార్టీ నిలకడ దేశ శ్రేయస్సుకి చాలా అవసరం.

దేశభక్తి, త్యాగం, విశాల దృక్పథం, రాజకీయానుభవం, నిజాయితీ—ఈ గుణాలన్నీ కల వ్యక్తి మాత్రమే రాష్ట్రపతి పదవికి అర్హుడు.

డాక్టర్ జకీర హుస్సెయిన్ అన్నివిధాలుగా ఈ పదవికి తగినవారు. ఆయన ఎన్నికవల్ల భారతదేశ రాష్ట్రపతి పదవి గౌరవప్రతిష్ఠలు మరికొంత పెరిగాయి అనటంలో అతిశయోక్తి లేదు. ●

డాక్టర్ జకీర్ హుస్సెయిన్ ప్రమాణస్వీకారం జరిగే ముందు రోజు శృంగేరీ పీఠాధిపతులయిన శ్రీ జగద్గురు శంకరాచార్యులని సందర్శించి వారి పాదాలవద్ద పుష్పఫలాలు ఉంచి ఆశీర్వదించమని కోరారు.'ఆప్ కా ఆశీర్వాద్ హయ్' అని డా. హుస్సెయిన్‌జీ కోరగానే శంకరాచార్యులు వారిని ఆశీర్వదించారు.

## రాష్ట్రపతి ఎన్నిక ఓట్ల వివరాలు

| రాష్ట్రాలు | ఓటు విలువ | డా జకీర్‌హుస్సేన్ | శ్రీ సుబ్బారావు |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 125 | 150 | 132 |
| మద్రాసు | 144 | 54 | 169 |
| ఒరిస్సా | 125 | 29 | 105 |
| హరియానా | 94 | 36 | 43 |
| కేరళ | 127 | 30 | 89 |
| మహారాష్ట్ర | 146 | 207 | 62 |
| పంజాబ్ | 107 | 55 | 43 |
| నాగాలాండ్ | 8 | 40 | — |
| గుజరాత్ | 123 | 96 | 71 |
| జమ్మూ అండ్ కాశ్మీర్ | 59 | 62 | 9 |
| అస్సాం | 94 | 84 | 37 |
| రాజస్థాన్ | 107 | 95 | 86 |
| మైసూర్ | 109 | 133 | 81 |
| ఉత్తరప్రదేశ్ | 174 | 210 | 209 |
| బీహార్ | 146 | 141 | 172 |

పార్లమెంటు ఉభయసభలలో డాక్టర్ జాకీర్ హుస్సేన్‌కు 447 ఓట్లు శ్రీ సుబ్బారావుకు 278 ఓట్లు వచ్చాయి. పార్లమెంటులో ఓటు విలువ 576 అవగా ఒక్క పార్లమెంటు వోట్లలోనే డాక్టర్ హుస్సేన్‌కి 97 వేల మెజారిటీ వచ్చింది. మొత్తం ఓట్లలో డాక్టర్ జాకీర్ హుస్సేన్‌కి 4,71,244 వోట్లు, శ్రీ సుబ్బారావుకి 3,63,971 వోట్లు వచ్చాయి. శ్రీ సుబ్బారావుపై డాక్టర్ హుస్సేన్ 1,07,273 వోట్ల మెజారిటీతో రాష్ట్రపతిగా ఎన్నికైనారు.

# లోకం పోకడ

—ప్రజాస్వామ్యానికి కావలసినది ఒకటేమిటంటే మంత్రులు ప్రజలు చెప్పేది వినటం.

21—4—67 'న్యూస్టేట్స్‌మన్'

* * *

—ఇద్దరిలో ఎవరు గెలిచినా భారత దేశం రాష్ట్రపతి పదవి విలువ తగ్గిపోతుంది.

7—5—67 లింక్.

* * *

—కాని శివాజీ, ఔరంగజేబ్‌లని కలిపి జాతీయ నాయకులుగా ప్రశంసించటానికి వీలులేదు, అన్నారు శ్రీ బాల్‌రాజ్ మధోక్.

11—5—67 పి. టి. ఐ. వార్త.

* * *

—శివసేన ఉద్యమం నేటి పరిస్థితుల పట్ల మహారాష్ట్రీయుల అసంతృప్తికి ఒక ఉదాహరణ. ఈ ఉద్యమానికి సంబంధించిన కొన్ని సృజనాత్మకం కాని వైఖరులని ఈ పత్రిక ఎదిరించినప్పటికీ, మహారాష్ట్రీయులు తమ స్వంతరాష్ట్రంలో, అందులో బొంబాయి నగరంలో, ఎన్నో సాంఘిక, ఆర్థిక ఇబ్బందులకి లోనవుతున్నారన్న విషయాన్ని కాదనలేము.

13—5—67 బ్లిట్స్‌లో 'వోక్స్‌పోపులీ.

* * *

—"ఆయన (డా. హుస్సెయిన్) ఇందిరా గాంధీ, బిర్లాల అభ్యర్థి" డా. లోహియా.

2—5—67 పేట్రియాట్.

* * *

—పోటీద్వారా ఎవరు ఎన్నిక అయినా అతి స్వల్పమయిన మెజారిటీనే తెచ్చుకొనగలుగుతారు.

6—4—67 పేట్రియాట్.

# న్యూఢిల్లీ లేఖ

(7 వ పేజీ తరువాయి)

సింగ్, హుకుమ్‌సింగ్ తదితర కాంగ్రెస్ వాదులైన సిక్కులకు వారి జాతీయులందు అనంతమైన పలుకుబడి ఉంది కాబట్టి కాంగ్రెస్ ప్రభుత్వం సిక్కిస్తాన్‌ని యివ్వాలా, అలాగే జాతీయస్థాయిలోని ముసల్మాన్‌లు కూడా వారి జాతి ప్రతినిధులు కాబట్టే భారతదేశం విభజింపబడి పాకిస్థాన్ ఏర్పడాల్సి వచ్చింది.

డాక్టర్ జాకీర్ హుస్సేన్ ఏ విధంగా చూసినా పెద్దమనిషి, దేశంలోని గొప్ప వ్యక్తులలో ఒకరు. ఆయనను ముసల్మాన్‌గా ముద్ర వేయటంవల్ల డాక్టర్ జాకీర్ హుస్సేన్‌కి ముఖ్యంగా ముస్లిమ్‌లకు శ్రీమతి గాంధీ అన్యాయం చేశారు. భారత రాష్ట్రపతిగా డాక్టర్ జాకీర్ హుస్సేన్ ఎన్నిక కావటం అన్నది భారతదేశం మత ప్రసక్తి రహితంగా వ్యవహరించిందని విదేశాల్లో శ్రీమతి ఇందిరాగాంధి ప్రదర్శించ దలచినది ఈ ఎన్నికవల్ల ఏమీ ప్రకాశమానం కాదు. కొత్త రాష్ట్రపతి మీద ఎంత గౌరవాభిమానాలున్నా శ్రీమతి గాంధీ, డాక్టర్ జాకీర్ హుస్సేన్‌ని గురించి పాకిస్థాన్, ఆనాడు మౌలానా ఆజాద్ గురించి జిన్నా వ్యక్తంచేసిన అభిప్రాయాన్ని తిరిగి వెలిబుచ్చితే దాన్ని అరికట్ట లేరు కదా!

డాక్టర్ జాకీర్ హుస్సేన్‌గారి రాష్ట్రపతి పదవి ముస్లిమ్ రాజ్యాలలో మంచి వాతావరణాన్ని సృష్టించగలదా, ముఖ్యంగా భారత్ పాకిస్థాన్ సంబంధాలను చక్కబరచ గలదా? పాక్ దురాక్రమణకు ముందే డాక్టర్ జాకీర్ హుస్సేన్ సౌదీ అరేబియా, ఇరాన్, టర్కీలకు సుహృద్భావ పర్యటనకు వెళ్లారు. ఆయన తిరిగిరాగానే ముస్లిమ్ దేశాలు భారతదేశంపట్ల స్నేహభావంతో పొంగిపోతున్నాయని అన్నారు.

భారత్ పాకిస్థాన్ యుద్ధంలో ఇరాన్, టర్కీ, ఇండోనీసియాలు పాకిస్థాన్‌కి ఆయుధ సహాయం చేశాయి. సౌదీ అరేబియా పాకిస్థాన్‌కి బంగారాన్ని బహూకరించింది. మరో పక్క భారతదేశం ఒంటరిదైపోయింది. అమెరికా, ఇంగ్లండ్‌లు రక్షణ సహాయాన్ని ఆపేశాయి. అమెరికా ఆర్థిక సహాయాన్ని కూడా ఆపేసింది.

గతనెల విదేశవ్యవహారాల మంత్రి శ్రీ చాగ్లా దీన్నే పునఃప్రదర్శించారు. ఆయన తిరిగి భారతదేశం రాగానే విలేఖరులతో, తాను పాకిస్థాన్‌కి యిస్తున్న ఆయుధాలను భారతదేశంపై ఏసందర్భంలోనూ పాకిస్థాన్ ఉపయోగించదని ఇరాన్ హామీ యిచ్చినట్లు ఆయన అన్నారు. ఒకవేళ భారత దేశానికీ పాకిస్థాన్‌కి ఏదైనా తగాదా వచ్చినట్లయితే ఇరాన్ తటస్థంగా ఉండిపోతుంది. కువాయిత్‌లోకూడా ఆయన యిలాగే కోరారు కానీ ఫలితంలేక పోయింది. ఇరాన్ హామీ యిచ్చిందే అనుకుందాం, తాను ఇచ్చిన ఆయుధాలను పాకిస్థాన్ భారతదేశంమీద ఉపయోగిస్తే ఏం చేస్తుంది. ఇదివరకు అమెరికా కూడా యిలాంటి హామీనే యిచ్చింది కానీ తాను యిచ్చిన ఆయుధాలను పాకిస్థాన్ ఇండియామీద ప్రయోగిస్తే నిస్సహాయంగా చూస్తూ ఊరుకుంది.

మరోవిధంగా ఆలోచిస్తే, శ్రీమతి గాంధీ ఆమె చుట్టూఉన్న పరస్పరం ప్రశంసించుకునే వ్యక్తులు ఆశించినట్లు డాక్టర్ జాకీర్‌హుస్సేన్ రాష్ట్రపతిగా ఎన్నికవటం అన్నది ముస్లిమ్ రాజ్యాలపై ఏవిధమైన ప్రభావాన్ని తీసుకురాలేదు. అమెరికాకు రోమన్ కాథలిక్ అయిన కీ. శే. కెన్నడీ అధ్యక్షుడుగా, అదీ మొట్టమొదటి సారి. ఎన్నికైనప్పుడు రోమన్ కాథలిక్ దేశాలలో ఎలాంటి ప్రభావం కన్పించలేదు. ఇక ముస్లిమేతర దేశాలకు సంబంధించినంతవరకూ శ్రీమతి గాంధీగారి చాతుర్య ప్రదర్శనను తిలకించి అభినందించడానికి వాటికి తీరికాలేదు. ప్రపంచ బాంక్ అధ్యక్షుడు శ్రీ జార్జి ఉడ్ క్రిందటివారం న్యూఢిల్లీలో అమెరికా అధ్యక్షుని మాటలను అప్పజెప్పారు. భారతదేశానికిచ్చే సహాయం దాన్ని అమలు జరిపేదాన్నిబట్టే విభజింపబడుతుందట. ఇంకోవిధంగా చెప్పాలంటే

మత ప్రసక్తి రాహిత్యంతో ఈ సహాయానికి ఎలాంటి సంబంధమూ లేదన్నమాట. ఎందుకంటే పాకిస్థాన్, ఇరాన్, టర్కీ మొదలైన ముస్లిమ్‌దేశాలన్నిటికీ సహాయం లభిస్తుంది.

మరోవైపు డాక్టర్ జాకీర్‌హుస్సేన్ ఎన్నిక దేశంలో జనసంఘ్‌ని మరింత బలపరుస్తుంది.

విభజన జరిగిన తర్వాత ప్రభుత్వోద్యోగాలలో ముఖ్యంగా ఇండియని ఎడ్మినిస్ట్రేటివ్ సర్వీస్‌లో ముస్లిమ్ ఉండటం చాలా అరుదైపోయింది. సమాధానం స్పష్టమైనది, నిశ్చయమైందీ ఏ ప్రభుత్వోద్యోగానికైనా ముస్లిమ్‌లకు వయస్సు పరిమితి యింతని లేదు. ఏ విధమైన ప్రాముఖ్యతకు గాని, మినహాయింపులకు గానీ యికముందు అర్హులు కారు మిగతా వారితో సమానంగా పోటీ చేయవలసిందే. డాక్టర్ జాకీర్ హుస్సేన్ కానీ శ్రీమతి గాంధీ కానీ ఈ పరిస్థితిని మార్చలేరు. అది మత ప్రసక్తి రహితం కాదు. జాతి ప్రాతినిధ్యానికి పునః ప్రవేశాన్ని కల్పించడమే అవుతుంది అలా మార్చటం.

అసలు విషయం వేరు. దాదాపు ఆలీఘర్ విశ్వవిద్యాలయంలో శిక్షణపొందే ముసల్మాన్‌లంతా ఉద్యోగాలకోసం పాకిస్థాన్‌కి వలస పోతున్నారు. గడచిన 20 సంవత్సరాల నుంచీ భారతదేశం, పాకిస్థాన్‌కి ఊరట కల్గిస్తున్నది—వైద్య, పౌర తదితర శాఖల ఉద్యోగులకు ఆలీఘర్‌లో తర్ఫీదు యివ్వడం మూలంగా. దీనితో ఏకీభవించనివారు ఆలీఘర్ విశ్వవిద్యాలయం రికార్డులను పరీక్షించుకోవచ్చు; అక్కడ పట్టాలు పుచ్చుకున్న ముస్లిమ్ పట్టభద్రులంతా ఏమవుతున్నారో తెలుస్తుంది.

ఇండియా ప్రభుత్వం ముస్లిమ్‌లు ఉద్యోగాల్లో ప్రవేశించడానికి అడ్డంకులు ఏమీ కల్పించలేదు. ముస్లిమ్ పట్టభద్రుల దృక్పథం పాకిస్థాన్ ఉద్యోగాలకు ప్రాధాన్యత నిస్తున్నది. అదే భారత ప్రభుత్వోద్యోగాలలో

(62 వ పేజీ చూడండి)



# గోల్డ్ ఫింగర్-22












రయిలు బండి ఫోర్ట్ నాక్స్ వయిపుకి దవుడు తీస్తోంది. బంగారు నిల్వల దగ్గిరికి ...

("అమెరికాలో వందమంది దొంగలు వాటి కోసం పోతున్నరు....")

("అందరూ డాక్టర్లు, నర్సులు! ఈ వేషంలో అక్కడ చచ్చి పోయిన అరవయి వేలమందికి సేవ చెయ్యటానికట......")

"ఫూ....ఆగుతున్నామనుకున్నాను...."

"అబ్బే, గోల్డ్ ఫింగర్ ఇంజన్ డ్రయివరు పని పట్టించాడంతే. చచ్చినవాడి బదులు కొత్త వాడు నడుపు తున్నాడన్నమాట..."










బండి ఫోర్ట్ నాక్స్ స్టేషన్ పరిసరాలకి వచ్చింది. అక్కడి దృశ్యం చూసి బాండ్ గుండె దడ దడ లాడింది......

("లెయిటర్‌కి విషంగురించి నేను పంపినసందేశం అందలేదన్న మాట.....")

"బాబూ, గోల్డీ వాళ్లందరికీ మంచినిద్ర మాత్రే ఇచ్చాడు...."

"అలాగే ఉంది......"

చావు! రయిలు బండి స్మశానంలోనుంచి వెళ్లినట్టుంది. ఎక్కడా కదలిక లేదు......










ఫోర్ట్ నాక్స్‌లో రయిలు బండి వేగం తగ్గింది. అంతా భీభత్సం—

"వాళ్లంతా నిజంగానే నిద్రపోతున్నారంటారా?"

"నాకు దూరంగా ఉండు! తుపాకులు పేల వచ్చు."

"—అదిగో ఖజానా దగ్గిర కొచ్చేశాము. ఇదే సయిడింగ్. గోల్డ్ ఫింగర్‌తోబాటు డీసెల్ ఇంజన్ మీద ఉంటాను".

అంతా మిలిటరీ కార్యక్రమం లాగ సవ్యంగా జరిగి పోయింది. ముందు దళం పెద్ద ఖజానా మీదకి వెళ్లి పోయింది....."







బాండ్ ఆత్రుతతో జీవకళకోసం వెతికాడు.....
"చివరి స్ట్రెచర్ వచ్చేసింది. బాంబుదళం సిద్ధంగా ఉండాలి. అందరూ చాటుగా నిల్చోండి. మరొక పది నిముషాలలో—"

"—నేను ప్రపంచంలో కెల్లా డబ్బున్నవాడి నవుతాను! ఏమంటారు మిస్టర్ బాండ్?"

"ఆ పది నిముషాలూ కానివ్వండి గోల్డ్‌ఫింగర్"










ఖజానావద్ద బాంబుదళంవారు ఆటంబాంబుతో పెద్దగేటునిదాటి వెళ్లారు దానితో 20 టన్నుల తలుపుని పగల గొట్టారు......

"మరొక అయిదు నిముషాలు మిస్టర్‌బాండ్. చాటుగా నిల్చుని, తర్వాత సెలవుతీసుకుందాము..."

ఆకాశంలోకి ఏమ్మవేదో ఎగిసి వెళ్లటం కడ కంటితో గమనించాడు బాండ్...










చెవులు పగిలేట్లు పెద్ద అవుటు ఒకటి పేలింది.

'చనిపోయిన' సైనికులు ఎగిరి లేవటం కూడా కడకంటితోనే చూశాడు బాండ్..
"ఎక్కడి వాళ్లక్కడే! ఆయుధాలు దింపండి!"

ఇక గందరగోళానికి అంతులేదు.....
"పట్టుకుని చంపండి ఇద్దరినీ—"
"టిల్లీ రా...... పరిగెత్తు."

(ఇంకా వుంది)

# తథాగతుడు

**ఈనెల 23 వ తేదీ బుద్ధజయంతి**

మిట్ట మధ్యాహ్నం. ఏకనాళ గ్రామం పరిసరాలలో ఒక పొలం. భరద్వాజుడు తన సేవకులతో ఎడ్లని విప్పమని చెప్పి భోజనానికి సిద్ధం అయ్యాడు. అందరూ ఒక పెద్ద చెట్టు చల్లని నీడకింద కూర్చుని అన్నం మూటలు విప్పారు.

అదే సమయానికి ఒక భిక్షువు వచ్చి వారి ముందు నుంచుని భిక్షపాత్ర ముందుకి జాపాడు.

భరద్వాజుడు ఆ ఊరి పెద్ద భూస్వాములలో ఒకడు. అతనికి సోమరితనం అంటే గిట్టదు.

'ఏమిటయ్యా, ఇలా ముష్టెత్తుకుని బతికే బదులు కాస్త వొళ్లొంచి పనిచెయ్యకూడదటా! నేను చూడు, స్వయంగా ఎంత పని చేస్తానో! నా పొలం నేనే దున్నుతాను, విత్తనాలు నేనే స్వయంగా నాటుతాను! పనంతా అయిన తర్వాతే తిండికి కూర్చుంటాను...నువ్వూ అదేపనిచేస్తే పొట్ట నిండేందుకు వీలవుతుంది కదా !' అని చివాట్లు పెట్టాడు.

'అయ్యా, నేనూ దున్నుతాను, విత్తనాలు వేస్తాను! ఆ తర్వాతనే తింటాను.' అని వినయంగా సమాధానం ఇచ్చాడు భిక్షువు.

'నువ్వా? దున్నటమా? ఏదీ నీ నాగలి? ఎడ్లెక్కడ?' భరద్వాజుడి చిరాకు అధికం అయింది.

'నిజమే—నేను కూడా రయితునే! పొలం దున్ని నాటువేసిన తర్వాతనే నేనూ తింటాను.' అన్నాడు మళ్లీ భిక్షువు అదే ధోరణిలో ఎంతో వినయంగా

'పచ్చి అబద్ధాలకి బాగా అలవాటు పడ్డావల్లే ఉంది! ఏదీ నీ పొలం? ఎక్కడో చూపించు!' భరద్వాజుడు మళ్ళీ రెట్టించి అడిగాడు.

'అన్నా, కోపగించకు! నేను అబద్ధం చెప్పటంలేదు! ఈ భూమి అంతా నా పొలం, ప్రయత్నమే నా ఎద్దు, సచ్చింతనమే నేను నాటే బీజం, సత్యం సహాయంతోనే కలుపు తీస్తాను, సత్ప్రవర్తనమే నాకు పండే పంట, ఈ పంటతోనే మానవుడి ఆత్మని పోషిస్తాను. అన్నా, నేనూ నీవంటి కర్షకుడినే! నీవలే నేనూ పొలం దున్ని నాటు వేస్తాను!' అని సమాధానం ఇచ్చాడు భిక్షువు

ప్రశాంతంగా పలికిన ఈ మాటలు భరద్వాజుడిలో ఒక వింత చైతన్యం కలిగించాయి. అతనిలోని అహంకారం, దుస్వహం మాయమయి పోయాయి; పశ్చాత్తాపం ఆవరించింది. లేచినుంచుని, వినమ్రుడయి, 'స్వామీ, క్షమించండి! అజ్ఞానంలో మిమ్మల్ని ఒక సాధారణభిక్షువు అనుకుని అవమానించాను! మా ఈ భోజనం స్వీకరించి మమ్మల్ని అనుగ్రహించండి!' అన్నాడు.

భరద్వాజుడిముందు భిక్షపాత్రతోనుంచున్న సన్యాసి బుద్ధభగవానుడు.

బుద్ధుడు క్రీ. పూ. 550 ప్రాంతంలో కపిలవస్తు గ్రామంలో జన్మించాడు. అతని తండ్రి శుద్ధోధనుడు శాక్యరాజు. శాక్యరాజ్యం హిమాలయ ప్రాంతాలలో ఉండేది. రాజధాని అయిన కపిలవస్తు వారణాసికి సుమారు 120 మయిళ్లదూరంలో ఉండేది.

సిద్ధార్థుడిది చిన్నప్పటినుంచీ అతి సున్నితమయిన మనస్తత్వం. ఇతరుల కష్టాలని కూడా సహించలేకపోయేవాడు. యుక్త వయస్సులో అతనికి యశోధర అనే అందమయిన రాజకుమార్తెని ఇచ్చి పెళ్లిచేశారు. కొంతకాలానికి వారిద్దరికీ ఒక పుత్రుడు జన్మించాడు.

ఒకనాటిరాత్రి హఠాత్తుగా సిద్ధార్థుడికి సంసార జీవితంమీద విరక్తి కలిగింది. బాధలనుంచి విముక్తి ప్రసాదించే జ్ఞానం కోసం సన్యసించటానికి నిశ్చయించుకున్నాడు. నిద్రపోతున్న భార్యా, సుతులకి తెలియకుండా వెళ్లిపోయాడు. కొన్నిసంవత్సరాల సాధన తర్వాత సిద్ధార్థుడికి బుద్ధగయలో ఒక బోధివృక్షం కింద జ్ఞానోదయం అయింది. అతను బుద్ధుడయిపోయాడు. తన సందేశాన్ని లోకానికి చాటటం ప్రారంభించాడు.

బుద్ధుడు మొదటి ఉపన్యాసం వారణాసి దగ్గ సారనాథ్‌లో జరిగింది. తన ఎనభయ్యవ ఏట బుద్ధుడు కుసినరలో మహా పరినిర్వాణం పొందాడు. బుద్ధభగవానుడు పుట్టినరోజూ, ఆయనకి జ్ఞానోదయం కలిగిన రోజూ, మహాపరినిర్వాణం పొందిన రోజూ కూడా వైశాఖ పూర్ణిమదినమే. అందుకేఈదినంమూడువిధాలపవిత్రమయినది.

కష్టాలు కోరికలవల్లనే పుడతాయి; సత్కర్మల ద్వారా కోరికలనే మంటలని అణచవచ్చు; జన్మ, పునర్జన్మలనుంచి తప్పించుకొనవచ్చు; నిర్వాణం పొందవచ్చు. బ్రాహ్మణుల ప్రమేయం లేకుండా ఎవరినడతకి వారే బాధ్యులుగా ఉండాలి.

'మీకు మీరే దీపాలు !' అని బోధించాడు బుద్ధుడు. చెడుచెయ్యకుండా ఉండటం, మనస్సుని నిర్మలంగా ఉంచటం బౌద్ధమతంలోని మూలసిద్ధాంతాలు.

కులసిద్ధాంతాన్ని ఖండించినవారిలో బుద్ధుడిదే అగ్రస్థానం. మానవులందరూ సమానులని బోధిసత్త్వుడు రెండువేల అయిదువందల ఏళ్లక్రితమే చాటాడు.

—వి. ఎస్. సుక్థాంకర్ ●






# మెదడుకి మేత

డాక్టర్ మహీధర నళినీమోహన్

◘ ఈ వ్యాసంలో ఇచ్చిన లెక్కల జవాబులన్నీ తప్పుగా ఉంటాయి. చేసిన లెక్క మాత్రం సరిగ్గా ఉన్నట్లే ఉంటుంది. అంతా సరిగ్గానే ఉంటే జవాబు తప్పు ఎందుకు అవుతుంది? అంటే ఎక్కడో తప్పులో అడుగువేసి ఉండాలి. ఆ తప్పు ఎక్కడ ఉందో వెతికి పట్టుకోండి చూద్దాం!

(క) 2 శేర్లు = 48 తులాలు—(1)

$\frac{1}{2}$ శేరు = 12 తులాలు—(2)

ఈ రెండు సమీకరణాలను గుణిస్తే

$2 \times \frac{1}{2}$ శేర్లు = $48 \times 12$ తులాలు

లేక,

1 శేరు = 576 తులాలు !

ఈ జవాబు విచిత్రంగా లేదా ?

* * *

(చ) $\frac{1}{4}$ రూపాయి = 25 పైసలు

రెండు వైపులా వర్గమూలం తీసుకుంటే

$\sqrt{\frac{1}{4}}$ రూపాయి = $\sqrt{25}$ పైసలు

లేక,

$\frac{1}{2}$ రూపాయి = 5 పైసలు !!

* * *

(ట) $(-5)^2 = 25$

$(+5)^2 = 25$

అంటే $(-5)^2 = (+5)^2$

ఈ సమీకరణంలో రెండు వైపులా వర్గమూలం తీసుకుంటే —

$-5 = +5$

అని వస్తుంది! అంటే ధన, ఋణ గుర్తులకు భేదమే లేదా?

* * *

(త) $\frac{x+5}{x-7} - 5 = \frac{4x-40}{13-x}$

అనే సమీకరణం ఉందనుకో. దీనిని సూక్ష్మీకరిస్తే —

$$\frac{x+5-5\ (x-7)}{x-7} = \frac{4x-40}{13-x}$$

లేక $\frac{4x-40}{7-x} = \frac{4x-40}{13-x}$

అని వస్తుంది.

రెండు వైపులా లవములు సమానమే కనుక, హారములు కూడా సమానమే. అంటే —

$7-x = 13-x$

లేక $7 = 13$

చాలా చిత్రంగా ఉందే !

* * *

(ప) ఒక మైలు చదరము = ఒక చదరపు మైలు. ఇందులో అనుమాన మేమీ లేదు కదా! రెండు వైపులా రెండు పెట్టి గుణించి చూడు.

రెండు మైళ్ళ చదరము = రెండు చదరపు మైళ్ళు.

ఈ రెండూ నిజంగా సమానమే నంటారా ?

* * *

(గ) $15x + 12 = 6 + 30$

అనే సమీకరణం ఉన్నదనుకో. దీనినే ఈ క్రింది విధంగా వ్రాయవచ్చు.

$15x - 30 = 6x - 12$

లేక $5(3x-6) = 2(3x-6)$

రెండు వైపులా $(3x-6)$చే భాగిస్తే

$5 = 2$

అనే చిత్రమైన సమాధానం వస్తుంది !

* * *

(జ) $16 - 48 = 64 - 96$

ఈ సమీకరణం సరిగ్గానే ఉన్నదని ఒప్పుకుంటారు కదా! ఇప్పుడు రెండు వైపులా 36 కలుపు.

$16 - 48 + 36 = 64 - 96 + 36$

దీనినే ఈ క్రింది విధంగా వ్రాయవచ్చు.

$(4-6)^2 = (8-6)^2$

లేక, $4 - 6 = 8 - 6$

లేక, $4 = 8$

ఇది నిజమని నమ్మడం ఎలా ?

(జవాబులు 62వ పేజీలో

బూట్లు వేసుకుంటే అరిగిపోతాయనుకొనేవాడివి ఇంత ఖరీదు పెట్టి ఎందుకు కొన్నావ్?



బాపు

# మట్టిబొమ్మలు

సీరియల్

తాడిగిరి పోతరాజు

**జరిగిన కథ**

వెంకట్రామయ్యగారికి చాలా జబ్బుగా ఉందని తెలిసి ఆత్మమిత్రుడు కామయ్య శెట్టిగారు, ఆయన చేరదీసి పెంచిన అనాథబాలుడు ప్రసాద్ ఆయన్ని చూడటానికి వెళతారు. వెంకట్రామయ్యగారు అంతకుముందు ఇచ్చిన పదివేలుకాక మరో పదివేలు ప్రసాద్‌కి ఇవ్వాలనుకుంటారు. వెంకట్రామయ్యగారి కొడుకు మధు వూరినుంచి వస్తాడు. ఉత్సవంలో కామయ్య శెట్టిగారి కూతుళ్ళు గౌరి, భామిని కలుస్తాడు. అతని మేనమామ కూతురు ఊర్మిళ. బొమ్మలకొలువు చూడటానికని మధు కామయ్య శెట్టిగారి ఇంటికి వెళతాడు. వెంకట్రామయ్యగారు చనిపోతారు. ఆయన భార్య అన్నపూర్ణమ్మ శివరామయ్యను పిలిచి మధుకు మేనరికాన్ని ఒప్పిస్తుంది. సెలవులకు వచ్చిన మధు తల్లికోరికమీద శివరామయ్యగారింటికి బయలుదేరతాడు.

## 7

ఆ ఇంటి ముందు చిన్న పూలతోట. పూలతోట మధ్యగా ద్వారానికి ఎదురుగా దారి. దారి కిరువైపులా ఇటుకరాళ్ళు పేర్చిన వరుసలు. వాటి ప్రక్కనే మెట్టతామర మొక్కలు. పంచపాళి చుట్టూ అమర్చిన 'డైమండ్' ఆకారపు వెదురు తడికలు— వాటి పైకి ప్రాకుతూన్న పూల తీగె సంధ్య వెలుగులో అస్పష్టంగా కనిపిస్తోంది.

అతను ఉద్వేగపూర్వకంగా బూట్లు 'టక టక్'— మనిపించుకొంటూ ఆ ఇంటి లోనికి నడిచాడు. స్వాగత వచనాలతో ఆహ్వానించటానికి ఎవర్నూ ఎదురు రాలేదు. ఒక్క [illegible] చూసి కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. 'టీపాయ్' మీదనున్న దిన పత్రికనందుకొని పుటలు తిప్పసాగాడు.

'[illegible] వచ్చ్యారో తెలియనే లేదు...' ముందు వాకిలి తలుపు తెర తొంగించుకొని ఆ గదిలోకి తొంగి చూసింది ఆమె. [illegible] అతిథిని చూసి చకితురాలయింది. కళ్ళు రెప రెప లాడాయి. పైరగాలి ఉధృతంగా వీచి ఆమె ముంగురులను అల్లనల్లన కదిలించింది.

'ఓహో...మీరా... ప్రసాదేమో అనుకొన్నాను—మీ బూట్ల శబ్దం విని. ఏమిటి ఇలా వచ్చారు?'...ఆ కంఠంలో నిర్లక్ష్యం ప్రతిధ్వనించింది.

అతను మాటాడకుండానే లేచి నిలబడ్డాడు. అతని చూపులు ఆమె శరీరం చుట్టూ తిరిగి, ఆమె కళ్ళపై తాత్కాలికంగా ఆగిపోయ్యాయి.

ఎర్రగా నిప్పు కణికల్లా మండుతున్నాయి అతని కళ్ళు.

'కూర్చోండి...ఇప్పుడే వస్తా'నని లోనికెళ్ళి మరో రెండు నిముషాలకు తిరిగి వచ్చింది. 'టీపాయ్'కి ఎదురుగానున్న కుర్చీలో కూర్చుని పమిట చెరుగును భుజాలమీదుగా లాక్కుని 'మా నాన్నగారికోసం వచ్చారా?' అని ప్రశ్నించింది.

'ఏం లేదండీ...ఉట్టనే ఉబుసుపోక వచ్చాను. ప్రొద్దుటినుండి పడుకొని పడుకొని విసుగుపుట్టి ఇలా వచ్చాను...కంపెనీ కోసం. అంతే!' పేపర్ 'టీపాయ్'పై పెట్టాడు.

బయట సంధ్య చీకట్లు మరింత దట్టంగా కమ్ముకోసాగాయి. కాకులు గుంపులు గుంపులుగా వచ్చి వేపచెట్లపై వాలి గోల చేస్తున్నాయి. పెరటిలో బావి..గిలకలు శబ్దం చేస్తున్నాయి.

'అలాగా!...అయితే ఇన్నాళ్ళూ ఊళ్ళో ఎలా గడపగలిగారు?'... ఆమె కంఠంలో వ్యంగ్య పరిహాసం వినిపించింది.

'ప్రతిరో[illegible]!...భలే ప్రశ్న అడిగారు. పేక—పుస్తకాలు. గొడవా గోదా—మా అమ్మే కదా!'...అతను చిరునవ్వు నవ్వాడు.

ఆమె పెదవులపై కూడ రేఖా మాత్రంగా దరహాసం పొడచూపి మాయమైంది.

'మీ అమ్మగారికి చాలా ఓపిక...పాపం ఇప్పుడు పనులు మరీ ఎక్కువైపోయుండవచ్చు' అంటూ లేచి గదిలో కెళ్ళి 'భామా' అని పిలిచింది. మసిగుడ్డతో గాజు గ్లాసు పట్టుకొని జాగ్రత్తగా నడుచుకొంటూ భామా వచ్చింది. ఆ గ్లాసు టీపాయ్ మీద పెట్టి లోపలకెళ్ళింది. ఆ కాఫీ గ్లాసు చూశాక అతనిలో ఒక క్రొత్త ఆలోచన మెదిలింది. తనపట్ల ఆమెకు హేయభావముందనే అభిప్రాయం అంతరించిపోయి కొత్త ఆశలు చిగుళ్ళు తొడిగాయి ఆ నిముషంలో. అతని ముఖం విప్పారింది. 'ము[illegible]కోండి'—ఆమె అంది.

'ఓహో...మీరు నాకోసం అనవసరంగా శ్రమ తీసుకొంటున్నారు ... వద్దండి మొహమాట పడుతూన్నట్లు నటిస్తూ తిరస్కరించసాగాడు ఆమె కళ్ళలో భావాలు చదువుతూ. తాను వద్దని తిరస్కరిస్తే ఆమె ప్రేమపూర్వకంగా త్రాగమని బ్రతిమాలుతుందో, అభిమానంతో బాధపడుతుందో లేక గంభీరంగా 'వద్దా—సరే'నని ముక్తసరిగా పలుకుతుందో గ్రహించాలని 'వద్దంటే వద్ద'న్నాడు.

కాని తానూహించిన ఈ మూడింటిలో ఏదీ సంభవించలేదు.

'ఫర్వాలేదు...తాగండి...మళ్ళీ...వాళ్ళింటికెళ్తే కనీసం కాఫీకూడ ఇవ్వలేదని నిందలు వేస్తారు—వచ్చినవాళ్ళకు 'కాఫీ' ఇవ్వకపోతే వాళ్ళకు సభ్యత తెలియని క్రింద పరిగణిస్తుంది సాంఘికత'...ఆమె దానిని అతి సామాన్య విషయంగా భావించి పేపర్లోకి చూస్తూ సహజమైన కంఠంతో పలికింది.

అక్షరాలు ఒకదానితో మరొకటి అలికినట్లు కలిసిపోతూన్నా ప్రయత్న పూర్వకంగా చదువుకోసాగింది.

'నే నిలాంటి ఫార్మాలిటీస్ పట్టించుకొనే వ్యక్తిని కాదు...అయినా మీరు నా గూర్చి ఇంత శ్రమ పడతారనుకొంటే ఈ వేళప్పుడొచ్చి మీకిలా పని కల్పించేవాణ్ని కాదు... థ్యాంక్స్' అంటూ గ్లాసు చేతిలోకి తీసికొన్నాడు, చిరునవ్వుతో.

ఆమె తృళ్ళిపడింది. సంభ్రమాశ్చర్యాలతో కళ్ళు పైకెత్తి అతనికేసి కన్నార్పకుండా చూసింది ఓ క్షణం. వెంటనే తలదించుకొంది. అతని మాటలకు ఎలా సమాధానమిస్తే ఉచితంగా ఉంటుందోనని జవాబు స్మృతిపథంలో వెతుక్కోసాగింది.

ఆ మౌనాన్ని ఆధారంగా తీసుకొని మరో రెండుమాటలు పలికాడు.

'మీరింతగా శ్రమపడి నాకోసం కాఫీ తయారుచేస్తే...నేనిలా తాగకుండ వదిలేస్తే నీకు బాధ కల్గుతుంది కదూ... శారదా...నీ మనస్సు నొప్పించటం నాకిష్టం లేదు' అంటూ గ్లాసు పెదవులదగ్గరకు తీసికొన్నాడు. తను వేసికొన్న విలువైన బట్టలు—మస్తాబు చేసికొన్నతీరు ఆమెలో తాను ఆశించిన ప్రభావాన్ని కలిగించాయన్న సంతృప్తితో 'కాఫీ' చప్పరించసాగాడు.

ఆమె తలపైకెత్తి ఛీత్కారభావంతో కూడిన చూపుతో అతనికేసి తిరిగింది. తన సభ్యతను మరోలా అర్థంచేసుకొని ఏకవచన ప్రయోగం చెయ్యటం ఆమెకు మరింత దుస్సహమనిపించింది. గదిలో చీకటి బాగా అలుముకోసాగింది.

'భానూ...దీపం పట్రా' పిలిచింది.

భానూ దీపం వెలిగించి తెచ్చి టేబిల్ మీద పెట్టింది. పొదుగాటి చిమ్నీతో తెల్లటికాంతిని ఆ గదినలుమూలా వెదజిమ్ముతోంది. భానూ లోపలికి వెళ్ళింది వారిద్దరిమధ్యా పెద్ద అగాధమున్నట్లు నిశ్శబ్దత అలుముకొంది ఓ నిముషంపాటు. అతను కాఫీ త్రాగుతూ మళ్ళీ మాట్లాడసాగాడు.

'మీకు మన ఊరెలానిపిస్తోంది. బోర్ కొట్టటంలేదా...ఏమిటో ఈ కవులు పల్లెసీమలనుగూర్చి తెగపొగడేస్తారు ... కానీ నిజంగా ఇక్కడ కనిపించేదేమిటి?...' అప్పటివరకూ దీపంకేసి చూస్తూ మాట్లాడుతున్న అతను ఆమెవైపు తిరిగాడు. ఆమె తలవంచుకొని చదువుకోసాగింది. 'దరిద్రం తాండవించే నికృష్టపు కొంపలు, దుమ్ములేచే బజార్లు, ఒంటిమీద సబ్బు పేరుకుపోయే ఉప్పునీళ్ళబావులు. ఆ కవిగారిని ఒక్క పది రోజులు ఇక్కడ ఉండమంటే సరి—తిక్క తిరుగుంది'...అంటూ పెద్దగా నవ్వాడు. ఆ పలోక్తి విని. [illegible] తనతోపాటు



ప్రశ్రుతికలిపి నవ్వుతుందని తలంచాడు. కానీ ఆలాటిదేమి జరుగలేదు.

'అయితే మద్రాసు తిరిగి వెళ్ళలేక పోయ్యారా...ఏం? సెలవులయిపోలేదా?' నిర్లక్ష్యంగా మాట్లాడి మళ్ళీ పేపరు చూడసాగింది.

అతను వెంటనే సమాధానం చెప్పక ఆమెను పరిశీలనగా చూడసాగాడు. ప్రకాశ వంతమైన ఆ దీపపువెలుతురులో ఆ తరుణీ మూర్తి అందం మరింతగా ప్రజ్వరిల్లోంది. ప్రక్కగా ముఖం తిప్పుకోవటం కారణంగా అర్థముఖాకృతిమాత్రమే కనిపిస్తోంది. సన్నని ముక్కు. ఎర్రగా మెరుస్తున్న చెంప. రెండు మొటిమలు మిసమిసలాడుతూ కొత్త అందాన్ని తెచ్చిపెడుతున్నాయి. పోతపోసిన కంచువిగ్రహంలా ఆమె కనురెప్పలు విశాలంగా వాలి ఉన్నాయి. ఇంగ్లీషు పద్యాలలో వర్ణించిన 'ఏంజెల్'లా తలంటుకొన్న కేశ పాశాలు రాగి రంగులో మెరుస్తున్నాయి.

'శెలవులు ఎప్పుడో అయిపోయ్యాయి. కానీ...కానీ వెళ్ళలేదు' రక్తవాహిని చెరికి చిమ్ముకొస్తూన్నట్లు ముఖము ప్రదీప్తమైంది ముందుకు జరిగి అంచున కూర్చుని ఆమెకేసి చూశాడు అదొక రకంగా.

ఆ చూపుల వెనుక నిగూఢంగా దాగి ఉన్న తృష్ణ ఆమె స్త్రీహృదయం అవగతం చేసికొన్నట్లు ఆమె నిశ్చలంగా చూసింది. చూపుప్రక్కకు తిప్పుకొని దీపం వత్తి పెద్దదిచేసింది. మరింత వెలుగు మడుగులా ఆ గదిని ముంచింది.

ఆమె కుంచించుకుపోయిన కళ్ళు ఆ కళ్ళల్లో ప్రస్ఫుటమౌతూన్న చీత్కార భావం సూటిగా అతని కళ్ళల్లోకి దిగిపోయింది. ఆమె చివ్వునలేచి నిలబడింది. సుడిగాలి ఆ గదిలో ప్రవేశించి, కాగితాలను రెపరెపలాడించసాగింది. ఆమె వెంటనే వాటిమీద 'వెయిట్' పెట్టింది. 'వెయిట్' క్రింద కాగితాలు ఒణకసాగాయి. తీవ్రమైన ఆమెచూపులకు తట్టుకోలేక అతను దోషిలా కళ్ళు దించేసుకొని కంఠం పెగుల్చుకొన్నాడు.

'మా నాన్నపోయి ఇరవై రోజులైనా కాలేదుగదా...మా అమ్మ దిగులుతో మంచాన పడకుండ ఆమెకు తోడుగా ఉందామని— ప్రసాద్ ఎక్కడికి వెళ్ళాడు? ఎంతసేపట్లో

# మట్టి బొమ్మలు

వస్తాడు?'... తడబడుతూన్న కంఠంతో ప్రశ్నించాడు. ఆమె ప్రత్యుత్తర మివ్వక తీక్షణమైన చూపులతో భరింపరాని మౌనంతో అతనిని భయపెట్టసాగింది. అతను లేచి నిలబడి 'వస్తానండి...చీకటి పడిం'దంటూ మెల్లగా జారుకోబోయాడు. అంతలోనే బయటనుండి మాటలు వినిపించాయి.

'నా కోసం మధు వచ్చాడా?...ఎంత సేపయింది?'

'ఇప్పుడే ... పది పదిహేను నిముషాలయింది'...భానూ కంఠం పలుకుతోంది. ఆ మరుక్షణంలోనే అడుగుతూను కంఠం లోనికొచ్చింది.

'నమస్తే'...అంటూ చేతులు జోడించాడు. గుండెలపైనుండి సగం బరువు దిగిపోయి నట్లు భారంగా నిట్టూర్చాడు.

'కూర్చో మధూ...కూర్చో ... నేను ప్రసాద్‌ని గుంటూరు పంపించి మధ్యాహ్నం మీ ఇంటికెళ్ళి వచ్చా. నీవు నిద్రబోతున్నా వంటే స్కూలుకి వెళ్ళిపోయ్యాను. ఏమిటీ విశేషాలు. మీ అమ్మగారింకా ఏడుస్తూనే ఉన్నారా!...ఏమైనా కోలుకొన్నారా?...పెద్దగా కోలుకొన్నట్లు నా కనుపించటంలేదు. ఆఁ .. కాలేజీకి ఎప్పుడు వెళ్తావ్...ఇప్పుడే వెళ్తే మీ అమ్మగారు...ఒక్క క్షణం ఆగు'అంటూ లోనికెళ్ళి లాల్చీ ఊడదీసికొని వంకెకు తగిలించాడు. కాళ్ళూ చేతులూ కడుక్కొని టవలుతో ముఖం తుడుచుకుంటూ 'ప్రసాద్ ఇంకా రాలేదావమ్మా...శారదా ... మంచినీళ్ళు పట్టూ' అంటూ తిరిగి గదిలోకి వచ్చి 'మధు'కి ఎదురుగానున్న కుర్చీలో కూర్చున్నాడు. శారద గ్లాసుతో మంచినీళ్ళందించి ఖాళీ గ్లాసు తీసికొని లోనికెళ్ళింది.

'ప్రసాద్‌ని ఏ పనిమీద పంపించారు గుంటూరు?'...ఏదో ఒకటి మాట్లాడక పోతే బాగుండదని ఆలోచించి ఆలోచించి, అడిగాడు.

'అదే...యస్. యస్. యల్. సి. పరిమిషన్ వ్యవహారం...ఆ వ్యవహారం పూర్తి కావటానికి ఇంకొ రెండు మూడు నెలలు పట్టవచ్చు. వాళ్ళు అడిగిన డబ్బు డిపాజిట్ కట్టి రమ్మని పంపించాను...వెళ్ళిన పనులు కాలేదో ఏమో...ఇంకా రాలేదు...ప్రసాద్‌కు తోడు ఇంకొకళ్ళుంటే—ఇంగ్లీషు వచ్చినవాళ్ళు— పనులన్నీ వెంట వెంటనే అయిపోతాయి... అన్నిటికీ ప్రసాద్ ఒక్కడే!' అంటూ పర ధ్యానంగా రోడ్డుకేసి చూడసాగాడు.

'రేపటినుండి నేనూ వస్తాను సార్. ఇంటివద్ద మాత్రం నేను చేయాల్సినవే మున్నాయి కనుక'— అతి వినయంగా పలికాడు. ఆ మాటలు మాష్టారు వినిపించుకో లేదు. బయట వినిపించిన బూట్ల శబ్దంతో లేచి వసారాలో కెళ్ళాడు.

'ప్రసాద్...వచ్చావా?.. ఏం ఇంత ఆలస్య మయిందే'...ఎదురేగి పల్కరించాడు.

'ఎక్కడ సార్..బస్సులు—వేళకొస్తేనా?'

అతని కంఠం విని భాను—శారద వసారాలో కొచ్చారు. మధు లేచి గడప మీద కాలుపెట్టి నిలబడాడు ప్రసాద్‌కేసి చూస్తూ.

'డి. ఇ. ఓ. లెటర్ చదువుకొని, మీరే స్వయంగా ఎందుకు రాలేదని అడిగారు. ఇదీ విషయమని వారు చెప్పమన్నట్లు చెప్పాను. ఇదుగో డబ్బు కట్టిన రసీదు. వాళ్ళు పైకి పంపించిన ఔట్ వార్డ్ నంబరు—ఆ లెటర్ యొక్క ట్రూ కాపీ' అంటూ అన్నీ మాష్టారి చేతిలో పెట్టాడు. భాను అతని చేతిలో వేలాడుతూన్న 'పండ్ల బుట్ట'ను అందుకొని లోనికెళ్ళింది మాష్టారు ఆ ఉత్తరాలన్నీ చేత పట్టుకొని మధ్య గదిలో నిలబడి దీపం వెలుతురులో అస్పష్టంగా గొణుక్కుంటూ దీర్ఘం తీసి కొంటూ, ఇంగ్లీషు వాక్యాలయినా తెలుగు భాషలా చదువుకోసాగాడు.

'అరే—మధూ?...నేనింకా చూడనేలేదు. ఎక్కడ మధూ? రెండు రోజులనుండి ఒకటే పనులు. నేనే వద్దామనుకొంటున్నా ఈవేళ...' అంటూ చిరునవ్వుతో ఆ గదికేసి నడువసాగాడు. తనతోపాటు ఆ గది లోకి రాకుండ వసారాలోనే ఆగిపోయిన శారదను గమనించి—

'రా....శారదా....కూర్చుందాం....ఆ...నీవు తెమ్మని చెప్పిన ఎంబ్రాయిడరీ సూదులు ఏ షాప్‌లోనూ లేవు. తిరగని షాప్సు లేదనుకో ... ఆ సూదులమ్మేవాళ్ళు అప్పు డప్పుడూ వస్తూంటారట. వాళ్ళదగ్గరే కొనుక్కోవాలిగానీ వజావద్ద దొరక వన్నారు.'

# స్నేహానుబంధం కిసాన్ స్క్వాష్‌తో




కిసాన్ స్క్వాష్ అధునాతన జీవిత నిర్మాతల అపూర్వ కల్పన! ఆహా! ఏం రుచి! ఉల్లాసవంతమైన విశ్రాంతులకు దీని ప్రత్యేకమైన రుచి ఉత్తేజాన్ని కలిగిస్తుంది. సహజమైన విటమినులతో ఆరోగ్య దాయకంగా ఉంటుంది. నారింజ నిమ్మ, మామిడి ఇంకా ఇతర రకాలనుండి మీకిష్టమైన దానిని వాడండి
భారతదేశంలో విస్తారంగా అమ్ముడుపోయే కిసాన్ స్క్వాష్ లలో అసలు పళ్ళరుచిని అనుభవిస్తారు.

కిసాన్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ బెంగళూరు

కిసాన్ స్క్వాష్ బ్రిటానియా క్లబ్ స్నాక్స్‌తోను, లీన్ వెల్ లతోను ఎంతో రుచి!

అన్నాడు కుర్చీలో కూర్చుంటూ; అతనికి ఎదురుగా 'మధు' కూర్చున్నాడు.

శారద ప్రసాద్ ప్రక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంది.

'నేను చెప్పిన షాప్‌కెళ్ళావా?... ఆ మార్కెట్టు కెదురుగా ఉంది?...అందులో అడిగావా?...'

'ఆఁ...ఆ.....అక్కడికి వెళ్ళటంవలనే నాకు ఐదుగంటల బస్ 'మిస్స'యింది. సరే—శారదా? కాఫీ ఏమైనా ఇస్తావా! తలపగిలి పోతోంది' రుమాలుతో ముఖం తుడుచుకొంటూ తను అడిగాడు.

ఆమె సమాధానం చెప్పటానికి కొద్దిగా సందేహించసాగింది. తయారు చెయ్యమని చెప్తాస్తానుండు...అయినా పిన్నిగారు పాలు సీశాలో లేదో అంటూ లేవబోయింది.

'ఫర్వాలేదులే శారదా!...ఉన్నాయేమోనని ...అయినా ఇప్పుడెందుకు భోజనానికి ముందు...' అతనన్నాడు తనకు బాధకలిగించటం ఇష్టం లేనట్లు,

'నీవు చాలా దురదృష్టవంతుడివి ప్రసాద్ ..పరాకుగా బజారుకేసి చూస్తూ పలికి క్షణమయ్యాక తిరిగి అంది— 'నీకోసం ఇప్పటివరకూ ఎదురుచూశాను, ఈ బస్సు కొస్తావని...ఈసారి బస్సుకొస్తావని...ఎంత సేపటికీ రాకపోతే ఈ రాత్రికి నీవిక రావేమో, పని కాలేదేమో అనుకొన్నాను. అంతలో మధుగారొస్తే...ఇప్పుడే' అంటూ ఆ మాటలు పూర్తిచెయ్యక ముఖం ప్రక్కకు తిప్పుకొంది.

'మధు' ముఖం తెల్లగా పాలిపోయింది. అవమానంతో శరీరం దహించుకుపోయి స్థాణువులా కుర్చీలో కూర్చుండిపోయ్యాడు. 'మధు' సమక్షంలో తాను ఆవిధంగా మాట్లాడటంలో శారద ఉద్దేశ్యమేమిటో తెలుసుకోలేక కలవరం చెందాడు ప్రసాద్. ఆమె ఆ విధంగా మధుపట్ల కఠినంగా ప్రవర్తించటానికి తానే కారణమని లోలోన నిందించి కొన్నాడు. వాళ్ళిద్దరినీ జాగ్రత్తగా పరిశీలించాడు. వాళ్ళముఖాలు కళావిహీనంగా ఉన్నాయి. అతనికి ఏమీ పాలుపోలేదు. ఏర్పడిన ప్రతిష్టంభన తొలగించాలన్న సంకల్పంతో ఓహో—అలాగా...ఓకె అంటూ పెద్దగా నవ్వి 'ఈ వేళ ఏమయిందో తెలుసా! అంటూ వారిదృష్టి వేరే విషయం

# మట్టిబొమ్మలు

వైపు మళ్లించటానికి ప్రయత్నించాడు. అంతలోనే—

'చిన్నమ్మాయి—చిన్నమ్మాయి...పళ్ళురేగా ...ఇంట్లో ఉన్నారా! లేరా? పంతులు గారూ' అంటూ బయట కేకలు వినిపించాయి.

'రా...కోటయ్యా!' మాష్టారి గొంతు ఆప్యాయంగా పిలిచింది.

'అక్కడ కొందుకులెండి ... వేరుశెనగ మండలుతెచ్చా...'తంపటే'సుకొందాం, పిల్లల్ని బయటికి రమ్మని చెప్పండి—చిన్నమ్మాయి - అగ్గిపెట్టె తీసికురా' అంటూ బయట కూర్చుని వేరుశనగ మండలకు మట్టి రాలగొట్ట సాగాడు. భాను అగ్గిపెట్టె చేతిలో పెట్టింది.

'చిటచిట 'మంటూ ఇంత ఎత్తున మంటలేచింది. చిన్నకర్రతో కొలుతూన్న మంటలను పొటుకు తిప్పసాగాడు. మంట ప్రక్కనే శారద—భాను. చెత్తంతా తగల బడి నుసిగా మారిపోయింది, కాయలు మాడిపోకుండ వెడల్పుగా కల్లాం చేశాడు. మధ్యమధ్యన వెలుగుతూన్న నిప్పురవ్వలు ఆరిపోసాగాయి.

'తినండి—ఉడుకుడికివి — తంపటికాడ కూసుని తింటే తిన్నట్టుంటుంది. ఏరే ఎన్నన్నా తిను తిన్నట్టే ఉండదు...ఎవరూ? మధుసూదనవా — ఏంది?...దారి తప్పి వచ్చినట్టుంది... గుడ్డలకు మైలంటుద్ది కూసోమాకు...నాల్గు కాయలేరి ఆయనకు ఎట్టు చిన్నమ్మాయి' అంటూ కాయలు నేలకు పొడిచి పగలకొట్టుకొని తినసాగాడు.

మాష్టారు — మధు — ప్రసాద్‌లు మాట్లాడుకొంటూ నిలబడి తినసాగారు. శారద చప్పున నాల్గు తిని చెంబూ గ్లాసూ తెచ్చి అరుగుమీద పెట్టి 'భామా...ఇక చాల్లే—నీకు ఒంటికి పడవ్...లేచి నీళ్ళు నాన్నగారి చేతులమీద పొయ్యి' అంది.

'లేమ్మా...అసలే పచ్చికాయలు...ఈ పచ్చి కాయలు తిని నీలు తాగితేనే కుక్కలకు పిచ్చెక్కేది ఈ కాలం'...కోటయ్య పలికాడు. భామా లేచి అందరి చేతులపై నీళ్ళు పోసింది. ఆ తరువాత అందరికీ చిన్న చిన్న బెల్లం ముక్కలు పంచిపెట్టసాగింది.

'నాకొద్దు...నాకొద్దు ... మళ్లీ చేతులు కడుక్కోవాలి అనవసరంగా' బెల్లం తినటానికి సిగ్గుపడుతూ 'మధు' అన్నాడు.

'మళ్లీ కడుక్కోవయ్యా...ఏం నీళ్ళు కొనేవా?...పెట్టేవా...ఏసుకో ఒక ముక్క నోట్లో...ఇవి తిన్న తరువాత బెల్లం తినాలని శాత్రం చెబుతోంది...తెలిసిందా?...' కోటయ్య మాటలకు అందరూ ఫక్కున నవ్వారు.

మహమాటపడుతూ చెయ్యిచాపి మందు మింగినట్లు ఒక బెల్లంముక్క నోట్లో వేసికొని చెయ్యి కడుక్కొని 'వెళతా మాష్టారు...' అన్నాడు.

'ఒక్కడివే ఏంచేస్తావ్ ఇంట్లో...నవ్వూ ఉండు...ప్రసాద్ ఉన్నాడు. శారద ఉందీ...' అప్యాయ్యంగా మాష్టారు అన్నాడు.

ఆ మాటలతో మధుకు గుండెలమీదనుండి పెద్ద బరువు దిగినట్లనిపించింది. అతని రాకను శారద నిరసించినప్పటికీ మాష్టారి హృదయంలో తనకు స్థానముందనిపించింది. ఆశారేఖ అతని మనసులో తళుక్కుమంది.

'బాగా చీకటిపడిపోయింది. ఒక్కడివే వెళ్ళగలవా? లేకపోతే నన్ను తోడు రమ్మంటావా?...' ప్రసాద్ కంఠంలో ఆత్మీయత ఉట్టిపడింది.

'అక్కర్లేదు వెళతా' నంటూ అతను ముందుకు కదిలాడు.

'మధూ...రేపు భోజనాలయ్యాక ఇటు వస్తావా? లేక నేనేరానా?' కేకపెట్టాడు ప్రసాద్ అతను వీధి మలుపు తిరిగాక.

'నేనే వస్తాను'... అతను చీకటిలోనుండి సమాధానమిచ్చాడు,

'పాపం — చిన్నపిల్లవాడు—వాళ్ళ నాన్న మీద దిగులుపెట్టుకొన్నట్లున్నాడు. ముఖం అదోలా అయిపోయింది. ఈ నాల్గురోజులూ అతన్ని ఒంటిగా తిరగనివ్వకండి' నేను భీతి వ్యక్తపరిచాడు మాష్టారు ప్రసాద్, శారదలకేసి చూస్తూ.

* * *

ఆ రెండవరోజు.

నడినెత్తిన సూర్యుడు సకసకలాడుపోతున్నాడు. జనమంతా 'కాగరో' అంటూ పొలం పనులమీద వెళ్ళిపోయారు. కోళ్ళు కుక్కలూ, లేగలూ, కొష్టాలలో విశ్రాంతి తీసుకొంటున్నాయి. కాకులు సహితం చెట్ల మీద మౌనవ్రతం పలకపోసున్నాయి. అదపా

టడవా ఒకమనిషి రోడ్డుమీద కదులుతున్నాడు. ఆవిధంగా జనసంచలనం లేనివేళలో ఆ ఊరికి ప్రాతినిధ్యం వహిస్తూ కళాశాలల్లో విద్యాబుద్ధులు నేర్చుకొంటున్న వాళ్ళు ముగ్గురూ ఆ పంచపాళీలో సమావేశమయ్యారు. భానుకూడ ఆ సమావేశంలో పాల్గొన్నది. మాట్లాడకుండ అన్నీ వింటూ కూర్చున్నది.

'హుష్—నాన్నగారు— నిద్రపోతున్నారు—మెల్లగా' అని హెచ్చరించింది శారద. 'నిజమే'నన్నట్లు ప్రసాద్ కనుబొమలు పైకెత్తి గుడ్లు పెద్దవిచేసి మూతి ముడుచుకొన్నాడు.

పోస్ట్‌మన్ కేక వినిపించింది బయట. భానూలేచి వెళ్ళి ఉత్తరం అందుకుంది.

'నాదేనా' ప్రసాద్ చెయ్యిచాపాడు.

అందరూ అతనికేసి దృష్టి కేంద్రీకరించారు 'ఘోరం...ఘోరం' అంటూ తల్లిపడి ఉత్తరాన్ని 'టీపాయ్' మీద పెట్టాడు.

'ఏమిటి?...ఏం జరిగింది?...మీ స్నేహితుల కెవరికైనా ప్రాణాపాయం సంభవించిందా,'—శారద అడిగింది. మధు—భానూలు కళ్ళప్పగించి చూడసాగారు.

'ఆ...అంతపనీ అయిందన్నమాటే...' ఎదురుగ్గా ఉన్న కొండను—మేఘాలను చూస్తూ పరాగ్గా అన్నాడు.

'అయిందన్నమాటే—అంటే ఇంకా పూర్తిగా కాలేదా?' భానూ అంది కొంటెగా చూస్తూ.

'ఆర్ట్సు' సబ్జెక్ట్సు తీసికొని క్లాసు కొట్టటమంటే అదొక హెర్క్యూలియన్ టాస్క్—అంతే'...తనలోతాను మాట్లాడుకొంటున్నట్లు పలికాడు.

'ఇప్పుడా ప్రమాదం ఎవరికి సంభవించింది...' పుల్లవిరుపుగా శారద అంది. 'మామిత్రు డొకడున్నాడులే...వాళ్ళన్నయ్య సంగతి...పోయిన మార్చికి పరీక్షలకు ఫీజు కట్టి మానేశాడు—క్లాసురాదని - మొన్న సెప్టెంబర్‌కు కూర్చున్నాడు. ఐదునెలలు కష్టపడి చదివి 'థర్డ్' క్లాసులో ప్యాసయ్యాట్ట.'

'మంచిపనే — ప్యాసయ్యాడు గదా?' భానూ అంది అమాయకంగా ముఖం పెట్టుకొని.

'మంచిపనా?...పిచ్చి భానూ...ఈమాత్రం దానికి ఐదునెలలు కష్టపడి చదువుకోవాల్సిన అవసరమేముంది?'

'మార్చిలో కూర్చుంటే తప్పేవాడేమో—పాపం' శారద అంది సానుభూతి నిండిన కంఠంతో. ఆ సునిశిత పరిహాసానికి శ్రోతలిద్దర్రూ పగలబడి నవ్వారు. ప్రసాద్ తన ప్రత్యర్థి కొదిట్టి తన చిరునవ్వును పైకి వ్యక్తపరచకుండ కోపాన్ని అభినయిస్తూ కంఠం విప్పాడు.

'మధూ...నీవు మాట్లాడవేమిటి?...నీది ఆర్ట్సేకదూ?' ఆశగా ముఖం పెట్టుకొని అడిగాడు.

'ఔను'—తల ఊపుకొంటూ సమాధానమిచ్చాడు.

ప్రసాద్‌కు ఏనుగ నెక్కినంతబలం చేకూరింది. అతనివైపు ముఖం తిప్పుకొని ఆత్మీయత వ్యక్తపరుస్తూ 'మన 'ఆర్ట్సు'లో ఎంత కృషిచేసినా 'క్లాసు' ఇవ్వరు—తీరా చూస్తే ఒకటీ అరలోనే క్లాసు మిస్ అవుతుంది—నేననుకొంటాను....ఇప్పుడీతను—'సైన్సు' తీసికొంటె క్లాసు తేలిగ్గా కొట్టేశావాడను కొంటూ...'

'వహ్వా...'సైన్స్' వాళ్ళు క్లాసులన్నీ కుప్పబోసికొని కూర్చున్నారు. తలకొకటి పంచి పెట్టటానికి' అతని దృష్టిని ఆకర్షిస్తూ శారద పలికింది.

'మరి నేను చెప్పింది అబద్ధమా?...నీవే చెప్పు—పోయిన సంవత్సరం మా సీనియర్ 'బాచ్'లో వాళ్ళు ఫస్ట్‌క్లాసులు—ఇరవై సెకండ్ క్లాసులూ—తక్కిన వాళ్ళందరూ ఆర్డినరీగా ప్యాసవటం ఒకగొప్ప విశేషమన్నీ దానికి అయనెంతో గర్విస్తున్నానని 'ప్రిన్సిపాల్' చెప్పాడా? లేదా? అసెంబ్లీలో'

'చెబితే,' క్వొశ్చన్‌మార్కు ముఖం పెట్టింది శారద.

'అదే—నేను మళ్ళీ చెబుతున్నాను. క్లాసు కొట్టదలచుకొంటే 'సైన్స్' తీసికొని డిపార్ట్‌మెంట్ హెడ్‌ని కాకాపట్టాలి. ఒకవేళ థియరీ సరిగా వ్రాయకపోయినా 'ప్రాక్టికల్స్'లో ఎక్కువ మార్కులువేసి క్లాస్ ఇచ్చి పడవేస్తారు.

'అంత తేలికనుకొంటే నీవు కూడా 'సైన్స్' తీసికోకపోయ్యావా... తెలిసేది?'

'నా కిష్టంలేదు.'

'నీకిష్టమున్నా నీకు సీటెవరిస్తారులే... 'ఆర్ట్స్' వాడికి...' ఎత్తిపొడిచింది శారద. 'మధు' 'భానూలు' మరొక్కసారి పెద్దగా నవ్వారు. 'మధు ఏదో తప్పుచేస్తున్నట్లు చప్పున నోరు మూసికొని ప్రసాద్ కేసి చూశాడు. అతను ఆ హేళనకు కించిత్తయినా బాధపడక చిరునవ్వుతో శారదకేసి చూడసాగాడు. ఆవేశంతో రెచ్చిపోయి ఇంకా మాట్లాడుతూనేఉంది.

'మీ ఆర్ట్సు' వాళ్ళసంగతి ఎవరికి తెలియదు—ఇర్రెగ్యులర్—క్లాసులు ఎగ్గొట్టటం—స్టూడెంట్స్ యూనియన్' అనీ—ఎన్నికలనీ, స్ట్రయికులనీ...ఇంతేగా— ఇంకా మాకులా ప్రాక్టికల్స్ ... రికార్డ్స్ ఉంటే



## మట్టి బొమ్మలు

అసలు బిడికేరారు. దేనికీ పనికిరాని వాళ్లందరూ 'ఆర్ట్సు' తీసికొంటారు. జీవితంలో ఒకలక్ష్యమంటూ లేనివాళ్లు...' ఆ మాటలు పలికినప్పుడు వ్యంగమైన చిరునవ్వుతో కళ్లు తిప్పుకొని ప్రసాద్‌ను వాలుచూపుతో వీక్షించింది.

'పైగా కాపీకొట్టేది—డిబార్ అయి పొయ్యేది. ఈ మహానుభావులే' చేతులు విసురుకొంటూ ముగించింది.

పరాజయం స్వీకరించినట్లు ప్రసాద్ నొసలు కొట్టుకొంటూ 'మధు' కేసి తిరిగాడు.

'అయితే...శారదగారూ?...'షిా మెయిన్' ఏమిటి?' ఇంతసేపటికి సాహసించి పల్కరించటానికి ఒక అవకాశం దొరికినందుకు 'మధు' లోలోన సంతృప్తి చెందారు.

'వారి మెయిన్‌సుగఆర్పి చెప్పడగండి' ప్రసాద్ అందుకున్నాడు.

'పొద్దున్నేలేచి 'ప్రాక్టికల్స్' అంటూ కాలేజీకివెళ్లి వాళ్లు చేసే పనేమిటో తెలుసా?... కప్పలను, పావురాలను, బిళ్లపురుగులను వానపాములను మెత్తని కత్తులతో చీల్చి ఏ ముక్కకు ఆముక్కకోసి పీకి అవతల పారేస్తూంటారు. ఒక్కసారి నేనెందుకో పనుండి 'శారద కోసం వెళితే 'లాబ్‌లో ఉంది పొమ్మన్నారు...పోయి చూద్దుముగదా? ఇంకేముంది? ఇంత పెద్ద గోండ్రుకప్పని వెల్లకిలాపడుకోబెట్టి నాల్గుకాళ్లూ పిన్నులతో చెక్కకు బిగకొట్టి నున్నితంగా దాని పొట్ట చీలుస్తోంది...దాన్ని ఏగ్రహావ్ అంటారంటే' అంటూ తల గోక్కుంటూ, వెక్కిరింతగా శారదకేసి చూశాడు.

ఇంటి పెంకులు దద్దరిల్లేలా అందరూ నవ్వారు. కళ్ల వెంట నీళ్లు కూడ తిరిగాయి ఆ నవ్వటంలో.

'తరువాత' భానూ అడిగింది నవ్వటం వలన కల్గిన ఆయాసం పూర్తిగా తగ్గక ముందే. ప్రసాద్ కాలు మీదకాలు వేసికొని ఠీవిగా కూర్చున్నాడు.

'అప్పుడు నేనడిగాను....వీటన్నిటినీ కోసి ఏంచేస్తారూ? అని ... దానికి శారద చెప్పిన సమాధానమేమంటే 'ఏంచేస్తాం?....నౌకర్లు వచ్చి ఆ ముక్కలన్నిటినీ ఊడ్చి అవతల

పారేస్తారని ' 'జానా?' అన్నట్లు శారద ముఖంపై దృష్టి నిలిపాడు.

'అంతా అబద్ధం…ఎందుకలా మామీద దుష్ప్రచారంచేస్తావ్. నీ దృష్టిలో 'సైన్స్' సబ్జెక్ట్సు అంత విలువలేనివిగా కనిపించి వంటిమాత్రాన…సరేపో— మీ 'ఆర్ట్సు' లో ఉన్న గొప్ప ఏమిటో చెప్పు.

'ఆర్ట్సు—అంటే కళలు' తడుముకోకుండ ప్రసాద్ సమాధానం చెప్పటానికి ఉద్యమించాడు. ముఖంలోకి అంతకు ముందున్న నవ్వులాట ధోరణి పూర్తిగా అదృశ్యమైంది.

'కళలవలన భావవికాసం కలుగుతుంది. శాస్త్రరంగంలో మీరు సాధించిన విజయాలు మానవాభ్యుదయానికన్న వినాశనానికే దారి తీస్తున్నాయని మీ శాస్త్రవేత్తలే ఒప్పుకొంటున్నారు. 'సైన్స్' మానవుణ్ణి పూర్తిగా 'మెకానికల్'గా మార్చివేస్తోంది. అలా కాకుండా మానవత్వాన్ని ప్రబోధిస్తూ మానవుడు యంత్రంగా మారిపొయ్యే ప్రమాదంనుండి అతన్ని కాపాడుతున్నాయి కళలు— వాడు యంత్రానికి బానిస కాకుండ 'సైన్స్' యొక్క ఆవశ్యకతకు కొన్ని పరిమితులు చూపుతున్నాయి కళలు.' వేదికపై నిలబడి ఉపన్యసిస్తున్న ధోరణిలో మాట్లాడుతూన్న ప్రసాద్‌కేసి చూసి శారద అంది.

'ఏమిటీ?…ఈ మానవత్వపు విలువలన్నీ చరిత్రలోనివేనా?'

అంతలోనే 'మధు'కూడ ప్రసాద్‌కేసి తిరిగి 'నీవు చరిత్ర విద్యార్థివా,' అని ఇంగ్లీషులో అడిగాడు.

'ఆ విషయం నన్నడగండి…నే చెబుతాను' శారద అందుకొంది. 'వారి మెయిన్ చరిత్ర…రాజకీయ శాస్త్రం సబ్‌సిడరీ… అందుకనే ఇలా మాట్లాడుతున్నాడు. కన బడటం లేదా రకం' గట్టిగా చురక తగిలించానుకొని శారద సంతృప్తి చెందింది. శారద ఆవిధంగా అనాలోచితంగా 'మధు' మాటలలో మాటలు కలపటం అతనిని ఆశ్చర్యంలో ముంచెత్తింది. ఈ విధమైన ఆకస్మిక పరిణామంతో, కొద్దిగా ధైర్యం ఏర్పడి నిటారుగా కూర్చున్నాడు.

'మీ చరిత్రలో నీకు కనిపించిన లోపమేమిటో చెప్పు— మీకులా మేము కప్పల్ని చాన పాముల్ని…ఈకకు ఈకా, తోకకు తోకా పీకి హింసించటం లేదే… నోరూ వాయీ లేని ఆ క్రిమికీటకాదులూ, ప్రాణి కోట్లపట్ల తనకున్న పూర్తి సానుభూతిని వ్యక్తపరచుకొన్నాడు— కళలు చదువుతున్న ఆదర్శ విద్యార్థిలా.

'లోపాలా…ఒక్కటేమిటి? అన్నీనూ… నాకయితే చరిత్ర అంటే తలనొప్పి— యుద్ధాలు—సర్వనాశన మయిపోవటం— పట్టణాలు కూల్చివేయటం —మళ్ళీ సంధి చేసికోవటం ఇంతేనా?…ఆ యుద్ధాలుకూడా గమ్మత్తుగా ఉంటాయి. ఎర్రగులాబీల యుద్ధం—తెల్లగులాబీల యుద్ధం—ఇక ఆ రాజులను చూడ్దామా — ఆరుగురు జార్జిలు— జార్జి ఫస్ట్— జార్జి సెకండ్— సిక్స్త్ వరకూ..నల్గురయిదుగురు హెన్రీలూ —ఎడ్వర్డ్‌లూ— ఇద్దరు ముగ్గురు చార్లెస్‌లు—ఎలిజబెత్ ఫస్ట్‌లు — ఎలిజబెత్ సెకండ్‌లు —అంతా గజిబిజి. ఎవరికాలంలో ఏం జరిగిందో ఒక్కటీ జ్ఞాపకం రాదు. చచ్చినవాళ్ళు చావగా, వాళ్ళపేర్లు—పుట్టిన తారీఖు—చచ్చినతేదీ…పరిపాలించిన కాలం, ఆక్రమించిన దేశాలూ-ఇవన్నీ జ్ఞాపకం పెట్టుకోలేక మనకు చావొస్తుంది.'… శ్వాసతీసికోటానికి కొద్దిసేపాగింది శారద.

'బానూ…మీఅక్కకు కొద్దిగా మంచి నీళ్ళివ్వు—పాపం అలసిపోయింది. ఇంత వేగంగా మాట్లాడటం వలన ఎంత 'ఎనర్జీ' వృథాఅయిపోయిందో…' భుజాలు ఎగరవేసి కొన్నాడు ప్రసాద్ మూతి బిగపట్టుకొని.

'ఏం అక్కర్లేదు..సానుభూతి' తల ముందుకు వాల్చుకొని పెదవులు విరిచి నవ్వుకొంది శారద.

వాళ్ళిద్దరూ అంత చనువుగా మాట్లాడుకోవటం, ఛలోక్తులు విసురుకోవటం నవ్వుకోవటం 'మధు' హృదయంలో అసూయను రగిల్చాయి. వాళ్ళచర్యలన్నిటికీ మరో ప్రేక్షకుడుగా ఉన్నాడన్న విషయం కూడ మరచి వాళ్ళు గంగల నవ్వుకోవటం కొంటెగా చూసికోవటం అతనికి బాధ కలిగించాయి. వాళ్ళల్లో కలిసిపోవాలని ఎంతో ప్రయత్నించాడు. ఎంత ప్రయత్నించినా వాళ్ళ సంతోషంలో పాలు పంచుకోలేకపోతున్నాడు.

అతనికి మాట్లాడే అవకాశమే చిక్కటం లేదు. చిక్కినా?….అంత సహజంగా వాళ్ళ మాటల్లో కలిసిపోగలనా లేదా? అన్న అనుమానం పీడించసాగింది. 'ఈమాట అందాంగదా' అని నిర్ణయించుకొనేప్పటకి సంభాషణ ఎంతో కొంతదూరం ముందుకు జరుగుతోంది.

ఇప్పుడు వాళ్ళలోపాటూ నవ్వటానికి ప్రయత్నిస్తూ ఇద్దరికేసి తేరిపారచూశాడు. నిన్న సాయంత్రం జరిగిన సంఘటన అతని కళ్ళలో మెదిలింది. ఆమెచూపిన చూపులో తనపట్ల అసహ్యాలను వ్యక్తపరచింది. ఆ చూపులో ఇవ్వాళ మార్పు సంభవించిందో లేదో, తనపట్ల అభిప్రాయం మార్చుకున్నదో లేదో తెలిసికోవాలని ప్రయత్నించాడు. కాని ఆమె ముఖంకేసి చూడటానికి ధైర్యం చాలటంలేదు.

(ఇంకా వుంది)






# ఎదురుతిరిగిన అవసరం

ఆంగీరస

ఆఫీసులో పని చేసుకుంటున్న రఘు, తనకు యింటినుంచి వచ్చిన అర్జెంటు టెలి గ్రామును చూచి విస్తుపోయాడు. తక్షణం బయలుదేరి రావలసిందన్ని అతని తండ్రి హైదరాబాదునుంచి ఇచ్చిందది. కారణం యేమీ తెలపలేదు. ఫలానా కారణం అయి వుంటుందని ఊహించడానికన్నా అతనికి ఆధారం దొరకలేదు. పదిహేనురోజుల క్రిందటే తాను హైదరాబాదునుంచి తిరిగివచ్చాడు. అప్పటికి యింట్లో తల్లి దండ్రులూ, చదువుకొంటున్న తమ్ముడూ క్షేమంగా ఉన్నారు. తాను దగ్గరవుండి పరిష్కరించవలసిన వ్యవహారమేమీ లేదు. ఇంతకూ ఆ కుటుంబంలో వ్యవహారాల ప్రసక్తే లేదు. తండ్రి గోపాలంగారు నిక్కచ్చి మనిషి. చాలా మర్యాదస్తుడు. చాలా ఉత్తముడని పేరు గడించుకొన్నాడు. గవర్నమెంటులో పెద్ద వుద్యోగంచేసి ఆస్తి పాస్తులు సంపాదించుకుని ఈ మధ్యనే రిటైరయ్యారు. నెలకు నాలుగువందలు పింఛను వస్తుంది. కుటుంబమూ పెద్దది కాదు. టెలిగ్రాం—అందులోను ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం రావడానికి కారణం తెలియక రఘు చాలా కలతపడసాగినాడు.

రైల్లో ప్రయాణం చేస్తున్న రఘు మనస్సు రైలుతోపాటు పరిపరివిధాల పరుగెత్తసాగింది. పర్వత గుహలద్వారా ప్రయాణం చేస్తున్నప్పుడు తానున్న పెట్టెతోపాటు హృదయంకూడా చీకటిలో మునిగిపోయినట్లు తోచింది. బడలిక హెచ్చుగా తోచింది. ఆకలిగావున్నా యేదీ తినడానికి మనస్కరించడంలేదు. ఎలాగో గమ్యస్థానం చేరుకున్నాడు.

బండీదిగి టాక్సీ చేయించుకుని యింటికి వెళ్లి హాండ్‌బాగుతో ఇంట్లో ప్రవేశించే సరికి ముఖంలో సంతోషాన్ని [illegible]

తల్లి సుభద్ర యెదురుగావచ్చి 'నాయనా! వచ్చావా! చాలా సంతోషం! నీవు వస్తావో, రావో అని సందేహంతో చాలా కలతపడుతున్నాను' అని అంటూ, అతని చేతిలోంచి సంచీ తీసుకుంది. 'అర్జెంటు టెలిగ్రాం యివ్వవలసిన అగత్యం ఏమి వచ్చిందమ్మా? ప్రమాదకర పరిస్థితులేవీ సంభవించలేదు కదా?' అని రఘు ఆతురతతో అడిగాడు.

'అలాంటి దేమీలేదు నాయనా! ఒక ముఖ్య విషయాన్ని గురించి నిశ్చయించటానికి నిన్ను ఇలా పిలిపించవలసి వచ్చింది. ఆ విషయం తర్వాత చెప్తానుగాని, ముందు కాళ్ళూ, చేతులూ కడుక్కొని రా. ఇంత ఫలహారంచేసి, కాఫీతీసుకుందువుగాని, దూర ప్రయాణంచేసి చాలా అలసిపోయావు.' అంటూ తల్లి తొందర పెట్టింది. రఘు గబగబా గదిలోకి వెళ్ళి ఆ దుస్తులు తీసివేసి కొళాయిదగ్గరకు వెళ్ళి కాళ్ళూ, చేతులూ కడుక్కొని గదిలో కూర్చుని ఫలహారం చేస్తున్నాడు

ఆ సమయంలో గోపాలంగారు హౌరతొరగా యింట్లోకి వస్తూ దూరంనుంచే భార్యనుచూచి 'ఏమిటి, అబ్బాయి వచ్చాడా? పదిగంటల బండిలో వాళ్ళ పిల్లను తీసుకుని వస్తున్నారు. సికిందరాబాదులో బస! మనం మధ్యాహ్నం రెండుగంటలకి అక్కడికి వెళ్ళాలి?' అంటూ కుర్చీలో కూలబడ్డారు.

సుభద్ర 'వచ్చాడు, యిప్పుడే, కాఫీ తాగుతున్నాడు. ఇంకా యీ ప్రస్తావన తేలేదు. నిదానంగా చెప్పాలని అనుకుంటున్నాను' అన్నది.

వీరిమాటలు గదిలోనుంచి వింటున్న రఘుకు ఏదో పెళ్ళిసంబంధం గురించే యీ తతంగం అంతా అని అర్థమయింది. ఇంతలో తండ్రి అతనిదగ్గరకు వచ్చి 'నాయనా! ప్రయాణంవల్ల చాలా బడలిక కలిగి వుంటుంది. భోజనంచేసి కాసేపు విశ్రమించు. మనం రెండుగంటలకి సికిందరాబాదు వెళ్ళాలి విశేషాన్ని మీ అమ్మ తెలియజేస్తుంది' అని చెప్పి ఏదో పనిమీద వెళ్ళిపోయాడు.

రఘు కొంత చికాకుతో తల్లిదగ్గరకు వచ్చి 'ఏమిటి యీ హంగామాఅంతా? పెళ్ళి చాపత్రయమేనా? ఈసంగతి నాకు తెలిపివుంటే ఎంతో బాగావుండేదే! ఎంత ఆందోళనపడ్డానో నీకేం తెలుస్తుంది?!!' అని అన్నాడు.

'పెళ్ళిని గురించే అని నీకు తెలిస్తే, నీవు వస్తావనే నమ్మకంలేక యీ సంగతి తెలియజెయ్యలేదు. ఇంతకూ మేం ఏమి తలపెట్టినా నీ మంచికోసమే అనుకో! గూరాబారాన్ని ఉన్నావుగదా! పెళ్ళిచేసుకోకుండా బ్రహ్మచారిగా ఎన్నాళ్ళు హోటలు మెతుకులు తిని కాలక్షేపం చెయ్యగలవు? కోడలు యింటికివస్తే కళ్ళారా చూడాలని నాకు ఎంతో ఆత్రంగా ఉన్నది.'

'అయితే కోడలు యింటికి రావడానికని యావజ్జీవమూ నన్ను బాధపడమంటున్నమాట.'

'బాధపడటమేమిటి? లక్షణంగా నువ్వు భార్యతో కాపురం చెయ్యాలని మా కోరిక. అది తప్పు కోరేదేమీలేదు.'

'అందుకని ఆశయాలన్నింటినీ చంపుకుని మీ సంతృప్తికోసం మీ ఆజ్ఞను వర్తిస్తే ఉండాలా?'

'మేము ఆవిధంగా కోరలేదు. అమ్మాయి మంచి సంప్రదాయం గల కుటుంబంలో పుట్టింది బుద్ధిమంతురాలు. చదువుకున్నా గర్వమనేది లేదు. ఎంతో అందంగా వుంటుంది. [illegible] ఉన్నది ఆ వివరాలన్నీ మీ [illegible] వల్ల తెలిశాయి. ఆవిడకు వాళ్ళను గురించి బాగా తెలుసునట! నువ్వు ఆ అమ్మాయిని చూడగానే గ్రహించగలవు. నీకు నచ్చితేనే యీ సంబంధం నిశ్చయించుకుందాము. లేకపోతే ఏం తప్పుతుంది. నువ్వు నా మాటకు ఎదురుచెప్పవనే ధైర్యంతోనే పిల్లను చూడడానికి వస్తామని మాట యిచ్చాము. మరి అడ్డుచెప్పకు.'

రఘు మరి యేమీ చెప్పలేకపోయాడు.

రెండు గంటలకు ముగ్గురూ బయలుదేరి టాక్సీలో సికిందరాబాదు, కన్యాదాత గోవర్ధనంగారు బసచేసిన గృహానికి వెళ్ళారు. గృహ యజమానీ, గోవర్ధనంగారు ఎంతో మర్యాదలతో వీరిని లోపలికి తీసుకుని వెళ్ళారు.

పరస్పర పరిచయాలు జరిగాక కొంత సేపు వినోద సంభాషణలతో కాలం గడిచింది. తరాత పెళ్ళికూతురు చేతనే కాఫీ, ఫలహారాలు యిప్పించి, ఆమెను అందరూ చూడడానికి అవకాశం కల్పించారు. రెండు పక్షాల వారికీ కాబోయే వధూవరులు నచ్చారు. రఘుకు ఆ సంబంధం అనిష్టంగా తోచలేదు. కన్య ముఖలక్షణాలలో అనుకూల్యమే ద్యోతితమైంది.

గోవర్ధనంగారు 'తమతో బంధుత్వం జరపడమే మా ప్రధానోద్దేశం. దీనికి దైవం అనుకూల్యాన్ని చూపడం మా అదృష్టం! శీఘ్రంగా ముహూర్తాన్ని నిర్ణయిస్తే మేము సర్వసిద్ధంగా ఉంటాము.' అని గోపాలంగారితో వినయపూర్వకంగా విన్నవించారు.

గోపాలం—మేము కోరేదికూడా అదే! శుభస్య శీఘ్రం అని పెద్దలన్నారు కదా! రెండు జాతకాలకూ అనుకూలంగా వేగంగానే ముహూర్తం నిర్ణయిద్దాం.

గోవర్ధనం—చాలా సంతోషం! మరి కట్నం విషయమై బావగారు తమ అభిప్రాయాన్ని సెలవిచ్చారు కారు. అది తెలిస్తే మేం ముందుగా జాగ్రత్తపడవలసి వుంటుంది.

గోపాలం కట్నం పుచ్చుకోవడం మా అబ్బాయికి సమ్మతం కాదు. మా దంపతుల అభిప్రాయమూ అదే! దైవవశాత్తూ మాకు ఆడపిల్లలు కలగలేదు కాని, ఒక వేళ కలిగ వుంటేను మా పద్ధతి యిదే! మేం ఎవ్వరికీ కట్నాలు యివ్వం. మేము పుచ్చుకోము కూడా

గోవర్ధనం- మీకు ఎదుటివారిని నిర్బంధించి కట్నం పుచ్చుకోవడం యిష్టం లేకపోవచ్చు. ఎదుటివారు మీ హోదాకున్నూ, వరుడి యోగ్యతలనూ అనుసరించి సంతోషంతో యిస్తే స్వీకరించడంలో తప్పేమీ వుండదు గదా!

గోపాలం—కన్యాదాత వరశుల్కం యిస్తే వరుణ్ణి కొనుక్కున్నట్లే కదా అర్థం. మా అబ్బాయి వెలకు అమ్ముడుపోవడం మాకు యిష్టం లేదు.

గోవర్ధనం-తమరు అలా భావించకూడదు. వరుడికి దక్షిణ యివ్వడం నిషిద్ధం కాదు. వివాహ తతంగంలో వరదక్షిణ ఒక అంగమని తమకు తెలియనిది కాదు. అందువల్ల దీన్ని శుల్కంగా భావించనక్కరలేదు. దానానికి దక్షిణ అవసరం కూడా.

గోపాలం—అలాగునా అయితే వివాహ సమయంలో కన్యాదానం చేసేటప్పుడు

# ఎదురుతిరిగిన ఆదర్శం

లాంఛనప్రాయంగా అయిదో, పదో దక్షిణగా యిచ్చారు.

ఈ మాటలకు గోవర్ధనంగారు ఎంతో ఆశ్చర్యపడ్డారు. 'ఎట్టి యోగ్యతలూ లేని వరులుకూడా వేలకొద్దీ కట్నాలు పిండుతున్న యీ కాలంలో హోదాగల కుటుంబంలో పుట్టి కేంద్రప్రభుత్వంలో పెద్ద ఉద్యోగంలో ఉన్న విద్యావేత్త అయిన వరుడికి కట్నం అక్కర్లేదని తిరస్కరించే ఉదార హృదయులు యీ కాలంలో వుండడం చాలా ఆశ్చర్యంగా ఉన్నది. ఎంతో అదృష్టం వున్నవారికే మీవంటివారితో బంధుత్వం కుదురుతుంది. మేమెంతో ధన్యులం అని' ఆయన గోపాలం గారిని చాలా ప్రశంసించారు. ముహూర్త నిర్ణయం వీలైనంత శీఘ్రంగా జరగాలని మరీ మరీ కోరారు.

*　　*　　*

పెళ్లికూతురి తండ్రి వధువును తీసుకుని ఏలూరికి వచ్చాడు. సంబంధం కుదిరిన సంగతి వారున్న వీధిలో అందరికీ తెలిసిపోయింది. పెద్ద హోదాలో ఉన్నవారితో అంత సులభంగా బంధుత్వం కుదరడం చాలా ఆశ్చర్యం అనిపించింది. ఎంతోమందికి వివరాలుమాత్రం యెవరికీ తెలియలేదు.

గోవర్ధనంగారి బావమరిది ఆవూరిలోనే ఉన్నాడు. అతనికి యీవార్త చెవినిపడగానే ఆశ్చర్యం కలిగింది. తన బావగారు ఎక్కువ వరకట్నానికి తూగగలవారుకారని అతనికి తెలుసును. అతను త్వరగా ఆయింటికి వెళ్లి వివరాలన్నీ తెలుసుకున్నాడు. మేనకోడలికి పెళ్లి కుదిరిన సంతృప్తి అతనికి కలగలేదు. కొంచెంసేపు ఆలోచించి బావగారితో ఇలా అన్నాడు.

'సులభంగా పెళ్లి కుదిరినందుకు బావగారు సంతోషిస్తున్నారు కాని నాకు ఒక్క సందేహం కలుగుతున్నది. పెద్ద ఉద్యోగం చేస్తూ, అందంగావున్న పిల్లవాడు కట్నం ఆశించలేదంటే దానికిదయినా ఒక కారణం వుండాలి గదా!'

'కట్నాలు యివ్వడమూ, గ్రహించడమూ వారి ఆదర్శాలకు విరుద్ధమట.'

'ఈమాటలకేమిటిలెండి? ఈ కాలంలో ఆదర్శాలు అనేవాటిని ఇనపపెట్టెలోపెట్టి పది తీగాలువేస్తే పీళ్లు ఉంచవలసిందే! డబ్బుకావాలి కాని, ఆదర్శాలు ఎవరికి కావాలండీ యిప్పుడు? ఆడపిల్లలు లేకపోవడం సరిపోయింది కాని, ఉండేటట్లయితే తెలిసివచ్చేది అయ్యగారి బిగువు; కట్నం యివ్వకుండా వరుడు ఎలా దొరుకుతాడో!'

'నాకు యిది ఆశ్చర్యంగానేతోచింది.'

'అందరికీ తోస్తుంది యిలాగే! కట్నం అడగపోవడానికి వరుడిలోవుండే యేదోలోపమే కారణమై వుంటుందని నా అనుమానం.'

ఈమాట విని గోవర్ధనంగారు కొంత దిగులుపడ్డారు. బావమరిదిమాట తనకూ సబబుగానే తోచింది. ఫలానా అని నిర్ణయించలేకపోయినా వరుడిలో తప్పక లోపం ఉంటుందని నిశ్చయించుకున్నారాయన.

ఆ తర్వాత ఆయన భార్యతో యీ విషయమై సంప్రతించారు. ఆమెకు కూడా అనుమానం కలిగింది. ఏదో దీర్ఘవ్యాధిగాని, అవయవలోపంగాని ఉండితీరాలనే అందరూ నిర్ణయించారు.

అందరూ ఆలోచించుకుని 'కొన్ని ఆర్థిక పరిస్థితులు అనుకూలంగాలేని కారణమున ప్రస్తుతంలో అమ్మాయికి వివాహంచెయ్యడం కుదరడంలేదు' అని విచారాన్ని తెలుపుతూ గోపాలంగారికి జాబువ్రాయడం జరిగింది.

గోపాలంగారు ముహూర్తాన్ని నిశ్చయించే లోపలనే యీజాబు అందింది. ఖచ్చితమైన సంబంధం తప్పిపోయినందుకు ఆయన కొంత కలతపడ్డారు. చక్కని అమ్మాయి కోడలు కాకుండా తప్పిపోయినందుకు సుభద్రమ్మకు కష్టమనిపించింది. రఘుమాత్రం వీటిని వేనిని పట్టించుకోలేదు. పదిరోజుల సెలవు మీదవచ్చినందున రెండు మూడురోజులు అక్కడేవుండి తిరిగి ఢిల్లీకి వెళ్లిపోయాడు.

పెళ్లి సంబంధం కుదిరిన సంగతి తెలిసినట్లే, తప్పిపోయిన సంగతి కూడా గోవర్ధనంగారి బంధువుల్లో కొందరికి తెలిసినది. కారణంమాత్రం యెవ్వరికీ తెలియలేదు. తమవద్ద ఆడపిల్లలున్న కొందరు దీనికి చాలా సంతోషించారు. ఒకరిద్దరు విషయాన్ని స్పష్టంగా తెలుసుకోవడానికి గోవర్ధనంగారి మిత్రులద్వారా ప్రయత్నించారు, వివరాలు తెలుసుకుని తమ పిల్లల కోసం ప్రయత్నంచెయ్యాలనే సంకల్పంతో. అయినా విశేషం లాభంలేకపోయింది. ఆర్థిక పరిస్థితులు అనుకూలంగా లేకపోవడంవల్లనే ఆ సంబంధం మానుకొన్నట్లు తెలిసింది.

పరిస్థితులు బాగాలేకపోతే మొదట్లో ఎందుకు ప్రయత్నించాలి? ఊరినుంచి వచ్చిన వెంటనే సంతృప్తిగాఉండి, తర్వాత అభిప్రాయం మార్చుకోడానికి కారణంయేమిటి? మగపెళ్లివారు ఎక్కువ కట్నం కోరారేమో? ఇలాటి సందేహాలు ఉదయించాయి కొందరికి. ఎలాగో గోపాలంగారి చిరునామామ తెలుసుకుని ఒకరిద్దరు హైదరాబాదువెళ్లి తమ కుమార్తెలను చేసుకోవలెనని ప్రాధేయపడ్డారు.

నిశ్చయమైన సంబంధం హఠాత్తుగా తప్పిపోయినందున గోపాలంగారి మనస్సు చాలా కలతపడుతూ ఉన్నది. ఇందుకోసం రఘును శ్రమపెట్టి హైదరాబాదు రప్పించినందుకు చాలా విచారం కలిగింది కూడా. దానితోపాటు వీలయినంత శీఘ్రంగా వివాహం జరిగించడమే ఉత్తమమని తోచింది కూడా. ఈసారి కుమారుడిని రప్పించకుండా తామే కన్యను చూచి నిశ్చయించాలని ఆయన సంకల్పం. ఇట్టి సంకల్పంతో ఉన్న గోపాలం వద్దకు ఒకరిద్దరు కన్యాదాతలు రాగానే మనస్సుకు కొంత నెమ్మది కలిగింది.

కన్యాదాతలు తమ కుమార్తెలను గోపాలం దంపతులకు చూపించడానికి హైదరాబాదు తీసుకునివచ్చి బంధువుల యిళ్లల్లో బస చేశారు. వారి ప్రార్థనపల్ల వీరు బంధువులను చూడడం కూడా జరిగింది. అమ్మాయిలు లక్షణంగా ఉన్నారు. చదువుకున్న వారు కూడా. నచ్చారు కూడా. ఈ తంతు అంతా చాలా రహస్యంగానే జరిగింది. ఏమంటే—ఒకసారి సంబంధం తప్పిపోయాక జాగ్రత్తగా వుండడం మంచిదని గోపాలం గారికి తోచి, ఊళ్లోవారికి తెలియకుండా వుండేటట్లే సంప్రతింపులు జరిపారాయన. కన్యాదాతలలో — ఒకరికి తెలియకుండా యింకొకరితో మాట్లాడి, వివరాలతోకూడా కన్యక ఫోటోను కుమారునికి పంపిస్తాననీ, అతని అభిప్రాయాన్ని తెలుసుకుని తెలియజేస్తాననీ చెప్పారు. కట్నాల సంగతి రాగా, తాము వరశుల్కం తీసుకొనుట కిష్టపడమనీ,

వానిని గురించిన ఆలోచన పెట్టుకోవద్దని స్పష్టంగా చెప్పివేశారు.

కన్యాదాతలు వెళ్ళిపోయారు, వధువుల ఫోటోలిచ్చి, వాళ్ళు సంతృప్తిపడి వెళ్ళిపోయారేకాని, వారిమనస్సులలో కూడా—కట్నం అక్కరలేదనడంతో — సందేహం కలిగింది. వరుడిలో ఏదో లోపం వుండి వుండాలనీ, లేకపోతే ఖండించి కట్నం నిర్ణయించి వుందురనీ వారికి తోచింది. వరుణ్ణి రప్పిస్తామని చెప్పకుండా, వివరాలు తెలియజేస్తామనీ, అతని అభిప్రాయాన్ని తెలుపగలమనీ చెప్పడం వల్ల సందేహానికి దోహదం యిచ్చింది. తమ వూళ్ళకు వెళ్ళిన తర్వాత కన్యాదాతలు ప్రస్తుతానికి వివాహం జరపడానికి తమ అశక్తతనే తెలియజేశారు. రఘు దగ్గరనుండి జవాబు రావడానికిముందే గోపాలంగారికి యీ జాబులు అందడం జరిగింది.

ఆయనకూ, భార్యకూ యీ సంఘటనలు మిక్కిలి ఆశ్చర్యాన్ని కలిగించాయి.

ఒకటి కాదు; రెండుకాదు, వచ్చిన నాలుగయిదు సంబంధాలిలా యీ విధంగా తప్పిపోవడంలో కారణం యేమిటో వారికి బోధపడడంలేదు.

* * *

రఘుకు తప్పిపోయిన సంబంధాలన్నీ ఒక్క ఊరునుంచి — ఏలూరునుంచి వచ్చినవే! మొదట్లో కారణం తెలియకపోయినా తర్వాత మెల్ల మెల్లగా బయటపడింది, వరునిలో ఏదో లోపం వుందనీ, అందువల్లనే

# ఎదురుతిరిగిన ఆదర్శం

కట్నాలిగా, కానుకలిగా అడగకుండా—నాటి సంగతి తలపెట్టవద్దని చెప్పుతూ కూడా పెళ్ళికుమారుడి తలిదండ్రులు సమ్మతించారనీ, అందువల్ల కన్యాదాతలు యిష్టపడలేదనీన్నీ. ఈవార్త పెన్నెలతోను, చిన్నెలతోనూ ఆ వూళ్ళో వ్యాపించింది. వరుడికి ఉబ్బసరోగమని కొందరూ, కాదు — క్షయరోగమున్నదని కొందరూ, పెద్దరోగమని కొందరూ చెప్పుకోసాగినారు. కుష్ఠురోగం కాకపోయినా తెల్లమచ్చల రోగమయినా ఉండితీరాలనీ, అందుచేతనే శరీరంలో ఏభాగమూ కనబడకుండా పూర్తిగా డ్రస్సు వేసుకునేవుంటాడనీ కొందరి వ్యాఖ్యానం!

ఏలూరులోవున్న పరిచితుల జాబులవల్ల యీ సమాచారాలన్నీ గోపాలంగారికి తెలిశాయి.

ఆయనకు చాలా ఆశ్చర్యం కలిగింది.

వరశుల్కం గ్రహించడానికి తాము సమ్మతించకపోవడం మూలంగా కన్యాదాతలకు లేనిపోని అనుమానాలు కలగడమూ, రఘుకు దీర్ఘరోగాలను కల్పించడమూ గోపాలం దంపతులకు తీవ్రమైన మనోవేదనను కలిగించాయి.

తామయినా ప్రయత్నించి వేగంగా వివాహంచెయ్యకపోతే యికమీద రఘుకు పెళ్ళి జరగడం కష్టమని వారికి తోచింది.

కొందరు ఆప్తులు యీ విషయమై ప్రయత్నించారు. కాని ప్రయోజనం లేకపోయింది.

రఘుకు ఏదో రోగమున్నదనే ప్రచారం జరగడమే దీనికి కారణం.

రఘు తండ్రికి యిది యిప్పుడు బాగా అవగతమైంది. దీనికి ప్రతికారం యేమిటా? అనే ఆలోచనలోపడ్డాడాయన.

చివరికొక నుంచి ఆలోచన తట్టింది.

కాని, ఆ ఆలోచనను ఆయన తన మనస్సులోనే గోప్యంగా ఉంచుకొన్నాడు. తుదకు భార్యకుకూడా చెప్పడానికి యిష్టపడలేదు.

తన ఆలోచనను ఆచరణలో పెట్టుటకు మాత్రం ఆయనకింకా అవకాశం లభించలేదు.

ఒక యేడాది గడచినది.

ఈలోపున తండ్రి కొడుకులకు ఉత్తర ప్రత్యుత్తరాలు వెనుకటి మాదిరిగా తరచు జరగడంలేదు. ఎప్పుడప్పుడు క్షేమసమాచారాలకయి మాత్రం జాబులు వ్రాయడం జరిగేది.

ఒకనాడు అనుకోకుండా ఒక జాబు వచ్చింది.

కాకినాడలో పేరు ప్రఖ్యాతులు గడించి, విశేషధనాన్ని ఆర్జిస్తున్న రామారావు అనే లాయరు వ్రాసిన జాబు అది!

అందులోని విషయం యేమిటంటే – ఆ లాయరుగారికి ఒక కుమార్తె ఉన్నది. కాకినాడ కాలేజీలో పి. యు. సి. చదివి ప్యాసయింది. పయి చదువు తల్లికి యిష్టపడనందున చదువు ముగించినది. తల్లిమాటపైనున్న గౌరవంకొద్దీ, ఆకన్యను గోపాలంగారి కుమారుడు రఘుకుయిచ్చి వివాహం చెయ్యాలని కన్యాదాత కోరిక. వధువు అందంగావుంటుందనీ, అణకువకలదనీ, గృహనిర్వహణపద్ధతులను తల్లివల్లనే నేర్చుకొన్నదనీకూడా ఆ జాబులో ఉంది

వరుని తల్లిదండ్రులు శ్రమ అనుకోకుండా కన్యను చూడడానికి కాకినాడ రావాలనీ, ఆకీలినివచ్చుటకు అవకాశం లేకపోతే తామే కన్యకను తీసుకొనివచ్చి చూపగలమని కూడా కన్యదాత తెలియజేశాడు.

ఆ వకీలుగారిని గురించి గోపాలంగారికి యింతవరకూ తెలియదు. తమ కుటుంబాన్నిగురించి ఆ లాయరుగారికి ఎలా



తెలిసిందో — తన చిరునామా ఎలా తెలిసిందో అని గోపాలంగారికి ఆశ్చర్యం కలిగింది. ఎవరో తన పరిచితులవల్ల — తెలిసివుండవచ్చునని ఆయన మనస్సును సమాధానపరచుకున్నారు కూడా.

కన్యను తమవూరికి రప్పించడం భావ్యం కాదని ఆయన అనుకున్నారు. వెనుకటి పరిస్థితులనుబట్టి చూచినా, అది అనుకూలమైనదికాదనే తోచి, తామే కాకినాడకు వస్తున్నట్లు రామారావుగారికి గోపాలంగారు తెలియజేశారు.

మరొక వారంరోజులలో ఆయనభార్యతో కూడా కాకినాడకు వెళ్ళారు.

చూపులు జరిగాయి. వధువు అన్నివిధాల నచ్చింది ఆ బాలికనుగురించిన వివరాలన్నీ తెలుసుకున్నాక రఘుకూడా యీ సంబంధానికి తప్పకుండా సమ్మతిస్తాడనే అభిప్రాయం వారికి కలిగింది.

'బావగారూ! మీ సంబంధంచేసుకోవాలనే సంకల్పం మాకు మనసారా ఉన్నది. మా అబ్బాయికూడా దీనికి తప్పకుండా సమ్మతిస్తాడనే నమ్మకం మాకు ఉంది. మనం నిశ్చయంచేసుకుని యీ విషయం తెలియజేద్దాం' అని గోపాలంగారే ప్రారంభించారు.

'చాలా సంతోషం. అలాగే చెయ్యవచ్చును. మరి — కట్నం విషయంలో బావగారి అభిప్రాయం ఏమిటో తెలుసుకోవలెనని ఉన్నది' అన్నారు కన్యదాత.

'అమ్మాయి లక్షణంగా — అనుకూలంగా ఉండాలి గాని, కట్నం అంత ముఖ్యం కాదు గదా! అయినా తమ అభిప్రాయాన్ని మొదట తెలియజేస్తే సంతోషిస్తాను.'

'నాకు ఒక్కర్తే కుమార్తె. ఈ వివాహం బాగా చెయ్యవలెనని నా సంకల్పం. కుమారుడి వివాహం గురించి నా కంత చింతలేదు. అది ఎలాగయినా జరగనియ్యండి. ఈ వివాహం కాస్త బాగా జరగాలంటే యీ కాలంలో పదివేలయినా ఖర్చవుతాయి. ఆ మాత్రం మొత్తం వరదక్షిణ యివ్వాలని మా సంకల్పం. ఇరవైవేలతో యీ శుభకార్యం జరిగితే మాకు సంతోషంగా ఉంటుంది.'

# ఎదురుతిరిగిన ఆదర్శం

'మీ ఆలోచన చక్కగానే ఉన్నది. మా అబ్బాయి పెద్ద చదువులు చదివి కేంద్రప్రభుత్వంలో మంచి ఉద్యోగంలో ఉన్నాడు. నెలకు ఆరువందలు తెచ్చుకుంటున్నాడు. మీరూ మంచిస్థితిలో ఉన్నారు. మన తాహత్తులకు తగిన విధంగా ఉండడం ధర్మం. ఈ రోజుల్లో మనవంటివారు వివాహం జరపడానికి పాతిక వేలయినా ఉండాలి. వివాహ ఖర్చులకు పదివేలు కావలసినదే! తమరు పదిహేనువేలు వరదక్షిణకు సమ్మతించగలరని నా అభిప్రాయం.'

'వరుని యోగ్యతను అనుసరించి పదిహేనువేలు అడగడం న్యాయమే! ప్రస్తుతం నేను మనవిచేసిన పైకానికే ప్రయత్నించవలసి ఉన్నది. చేతిలో అంత మొత్తం లేదు. ముందు ముందు పండుగులకూ, పర్వాలకూ, లాంఛనాలకూ ఎక్కువగానే వరునికి ముట్టుతూ ఉండగలదు. ప్రస్తుతం మాత్రం తమరు...'

'మా అబ్బాయికి ఎన్నో సంబంధాలు వస్తున్నాయి. మేము కోరిన కట్నం యివ్వడానికి కొందరు సిద్ధముగానూ ఉన్నారు. అయినా, మా దంపతులిద్దరికీ నచ్చినందున తమతో బంధుత్వానికి సిద్ధపడుతున్నాం. మా రఘు చిన్నబుచ్చుకోకుండా వుండాలని మా కోరిక. అందువల్లనే నిష్కర్షగా యిలా చెప్పవలసి వచ్చింది.

'ఇలాంటి విషయాల్లో మా కుర్రవాని సలహాకూడా తీసుకోక స్వతంత్రించి నిర్ణయించడం నా కిష్టంలేదు. వాని మూలంగానే తమ పరిచయభాగ్యం పొందడానికి అవకాశం కలిగింది. వారం దినములలో తమకు లేఖ మూలంగా తెలియజేస్తాను.'

'అయితే మా రఘును మీ పిల్లవాడు ఎరుగునన్నమాట.'

'ఎరుగును. ఇద్దరికీ కొంత పరిచయమున్నట్లు మా కుర్రవాడు వ్రాశాడు.

'చాలా సంతోషం.'

* * *

ఇంటికి రాగానే గోపాలంగారు వివరాలు తెలుపుతూ కుమారుడికి జాబు వ్రాశారు. ఆ జాబు అందేలోపలనే రఘు దగ్గరనుంచి ఒక జాబు వచ్చింది. శ్రీధర్ తనకు మిత్రుడనీ, ఢిల్లీలోనే పని చేస్తున్నాడనీ, వారు మన శాఖవారే అనీ, అతనికి ఒక చెల్లెలు ఉన్నదనీ, చదువుకున్నదనీ. లక్షణంగా ఉంటుందనీ, ఈమధ్య తండ్రితో కూడా ఢిల్లీకి వస్తే ఒకసారి తాను చూడడం తటస్థించినదీ, ఆ అమ్మాయిని వివాహం చేసుకోవాలని యిప్పుడు తన్ను నిర్బంధంగా అడుగుతున్నాడనీ—అందులో ఉన్న విషయం. ఆ అమ్మాయి ఫోటోకూడా ఆజాబుతోచేర్చి పంపబడింది. తీరాచూస్తే ఆవధువు తాము కాకినాడలో చూచిన రామారావు గారి కుమార్తెయే !

రఘు తలిదండ్రుల అభిప్రాయాన్ని కోరాడు. తాము నిశ్చయించిన కన్యను గురించే రఘు వ్రాసినందున—వారికి చాలా సంతోషం కలిగింది.

మర్నాడు కాకినాడనుంచి కూడా జాబు వచ్చింది. గోపాలంగారు కోరినట్లు పదిహేనువేలూ కట్నమివ్వడానికి సమ్మతించినట్లు రామారావుగారు వ్రాశారు.

'అతడు కోరిన కన్యనే రఘుకు యిచ్చి వివాహంచెయ్యడానికి నిర్ణయించినట్లున్నూ కొద్దిరోజుల్లోనే ముహూర్తం నిర్ణయింపబడునట్లున్నూ గోపాలంగారు కుమారునికి తెలియజేశారు.

* * *

మరికొద్దిరోజుల్లో రఘుకూ, ఇందిరకూ వైభవంగా వివాహం జరిగింది.

వివాహసమయంలో వరదక్షిణయిచ్చే సమయంలో కట్నం మొత్తాన్ని ఒక కవరులోపెట్టి చక్కని పర్సులోఉంచి మామగారు అల్లుడికి అందించారు. రఘు, దాన్ని తండ్రికి అందించాడు.

గోపాలంగారు తాము వధువుకు అలంకారాల నిమిత్తం ఆపైకం యిస్తున్నట్లు ప్రకటించి, ఆ పర్సును వధువు చేతిలో ఉంచారు.

అక్కడివారందరూ ఆశ్చర్యపోయారు.

# వారఫలం

## 26-5-1967 శుక్రవారం మొదలు 1-6-1967 గురువారం వరకు.

**మేషం :** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభించగలవు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృషభం :** వారంప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు ఏర్పడి తరువాత సర్దుకుంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతనవ్యవహారాలు లాభించగలవు. మిత్రులకు సహాయంచేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిధునం :** ఫలితంమాట యెలాగఉన్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. వారం, మధ్యలో అనుకోని చికాకులకు గురికాగలరు. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్యరంగాల్లో మీకృషి రాణించగలదు. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :** వ్యవహారాన్ని పూర్తిగా నెరవేరేవరకు నమ్మటానికి అవకాశంలేదు. వృత్తివ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేదిమరొకటికావచ్చును. పోటీవారితో వాదప్రతివాదాలకు దిగడం తగదు వారం మధ్యలో ఆర్థికవ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**సింహం :** మీకుముమ్మందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. వృత్తిలో కొత్తవారి పోటీనియెదుర్కోవలసి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాలవిషయంలో అనుకూలవార్తలను వింటారు.

**కన్య :** వృత్తివ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా దానికి తగిన ఫలితం లభించగలదు. ఉద్యోగంలో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. పోటీవారితోమాట పట్టింపులు తగవు.

స్త్రీలకు— కుటుంబవ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

**తుల :** వ్యాపారంలో పోటీవారిపోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. సామాన్యమైన పనులకు కూడా వారంమధ్యలో విశేషమైన ప్రయత్నం చేయవలసివస్తుంది. సాహసముతో కూడినవ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులసహాయం లభిస్తుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది బంధుమిత్రులను కలుసుకొంటారు.

**వృశ్చికం :** భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. అనుకూలవార్తలను వింటారు.

**ధనుస్సు :** వృత్తివ్యాపారాల్లో యిదివరకు యేర్పడ్డ చికాకులు తొలగిపోతాయి. వ్యాపారంలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. ఆర్థికవ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. సాంఘికవ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం :** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితియేర్పడుతుంది. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. వారంమధ్యలో అనుకూలత లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభించగలవు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. మిత్రులసహాయం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**కుంభం :** వృత్తివ్యాపారాల్లో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలించగలవు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభిస్తాయి. వారం మధ్యలో అధికవ్యయం జరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ప్రయాణాలు శ్రమమీద ఫలించగలవు.

స్త్రీలకు— ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మీనం :** కొన్ని వ్యవహారాల్లో మీకు లేని పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసివస్తుంది. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణిస్తుంది. వారాంతంలో చికాకులకు గురికాగలరు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

—మహేష్










**శ్రీ బులుసు వెంకటరమణయ్య**

ప్రపంచంలోని ప్రతిప్రాణికీ కొన్ని నియమాలుంటాయి. మశకం మొదలు మహాగజం వరకూ కొంతవరకైనా ఆ నియమాలను అనుసరించే జీవయాత్ర సాగిస్తాయి. ఇక మానవులను గురించి వేరే చెప్పనక్కరనేలేదు. నియమరహిత జీవితం తెగిపోయిన గాలిపటం వంటిది.

మన ప్రాచీన మహర్షులు వర్ణాశ్రమ వ్యవస్థలను ఏర్పరచి కొన్ని నియమాలను ఏర్పరచారు. ఆ నియమాలలో సంస్కారాలు ముఖ్యం. భారతీయులకు నియమితములైన సంస్కారాలు నలభై ఉన్నాయి. ఈ విషయమే 'చత్వారింశతా సంస్కారైః సంస్కృతః' అనే సూత్రంలో వివరించబడింది. ఈ నియమాలన్నీ అందరికీ లేకపోవచ్చు. కొన్ని కొందరికి మాత్రం ప్రత్యేకించబడి వుండవచ్చు. కాని, జాతకర్మ, నామకరణం, వివాహం మున్నగునవి మాత్రం అందరికీ ఉండవలసినదే! పంచవిధ యజ్ఞాలు, ఇతరములైన పాకాది యజ్ఞాలూ—మొదలైనవి విశేష సంస్కారాలు!

మానవులలో కొందరికి ఈ సంస్కారాలన్నీ ఉంటాయి. కాని హృదయం ఉండదు. ఉత్తమ శీలం ఉండదు. దేవునికి పూజా పురస్కారాలు జరిగిస్తూ, మహాభక్తులుగా పేరుమణి అవుతూ, ద్రోహచింతతో ఉండే పక్షంలో అట్టివారి స్థానం యేమిటి? ఈ విషయాం ఆలోచించవలసిందే!

ఈ సంస్కారాలతోపాటు ఎనిమిది ఆత్మగుణాలు కూడా ధర్మసూత్రాలలో వివరించబడ ఉన్నవి. గౌతమ ధర్మసూత్రాల్లో ఈ విషయం ఇలా ఉంది—

'అథాష్టా వాత్మగుణాః
దయా సర్వభూతేషు క్షాంతి రనసూయా, శౌచమనాయాసో మంగళమకార్పణ్య మస్పృహేతి.'

[గౌతమ ధర్మసూత్రములు—
1—8—23,24]

'ఈ సంస్కారాలు కాక ఎనిమిది ఆత్మగుణాలున్నవి. అవి 'యేమంటే—సర్వప్రాణులయందును దయ, సహన గుణం, అసూయ లేకుండుట, శౌచం, ఆయాసం లేకుండుట, కల్యాణగుణం, కార్పణ్య గుణం లేకుండుట, కోరిక లేకుండుట—అనేవి.'

ఈ సంసస్కారాలు ముఖ్యమా? లేక ఆత్మగుణాలు ముఖ్యమా?—అనే సందేహం ఆ కాలంలోనూ కలుగకపోలేదు.

ఈ విషయంలో అప్పటి మునులే చర్చలు జరిపి ఒక నిర్ణయానికి వచ్చారు.

ఈ సంస్కారాల వల్లగాని, ఆత్మగుణాల వల్లగాని లౌకికమైన ప్రయోజనం కానరాదు. పారలౌకిక ప్రయోజనమే కానవస్తుంది. వీటివల్ల బ్రహ్మ సాయుజ్యాన్నీ, సాలోక్యాన్నీ పొందవచ్చును.

కొందరు ఉత్తమ గుణాలకూ, తన్మూలకంగా ఉత్తమ శీలానికీ ప్రాముఖ్యం ఇచ్చారు. శీలం లేనివారి జీవనం వ్యర్థమనీ, ఉత్తమ గుణాలు అలవడనిదే శీలం అలవడదనీ వారి అభిప్రాయం.

కొందరు సంస్కారాలే ముఖ్యమన్నారు.

అయితేనేం? చివరకు గుణాలు ప్రధానం అన్న వారివాదమే నెగ్గినది.

కేవలం సంస్కారాలన్నీ ఉండినా, ఆత్మగుణాలు లేకపోతే—అటువంటివారు బ్రహ్మ సాయుజ్యాన్నీ, సాలోక్యాన్నీ పొందరనీ, సంస్కారాలు లేకపోయినా ఆత్మగుణాలు ఉన్నట్లయితే అట్టి గుణవంతుడు తప్పక బ్రహ్మ సాయుజ్యాన్నీ, సాలోక్యాన్ని పొందగలడనీ—గట్టిగా ముచ్చిముమ్మారూ చెప్పి నిర్ణయించారు.

దీన్నిబట్టి సంస్కారాల కంటె గుణాలు ముఖ్యమని స్పష్టంగా తెలుస్తున్నది.

గుణాలుండి సంస్కారాలు లేకున్నా నష్టం లేదు.

సంస్కారాలుండి గుణాలు లేకపోతే ప్రయోజనం లేదు.

ప్రాచీన కాలంలో కూడా — సంస్కారాలకు ప్రాధాన్యం ఇచ్చిన దినాలలోనూ ఉత్తమ గుణాలు ఎట్లా గౌరవించబడుతూ ఉండినవో గ్రహించవచ్చును. ●

# శాసనసభ విదుషీమణులు - 1



రాణీ కుముదినీదేవి

రాణీ కుముదినీదేవి గారి కార్యదీక్ష, నిరాడంబర నిశ్శబ్ద నిస్తుల నిర్మాణ కృషి స్వర్గీయ జవహర్లాల్ నెహ్రూను, రాష్ట్ర అధినేతలనూ కదలించి కమనీయమైన కైవారాల్ని పల్కించినది; సభాపతి హోదాలోను, శాసన సభ్యురాలుగానూ ఆమె చూపిన ప్రతిభ, దక్షత, ప్రతిపక్ష పార్టీల ఉద్దండులకు సైతం స్తుత్యమైనది; ఆమె ఆంగ్ల భాషోపన్యాసమూ, సభానిర్వహణా చాతుర్యమూ సభాపతి శ్రీ బి. వి. సుబ్బారెడ్డి గారికి హృద్యమై, ఆయన ప్రశంసాపద్యను పొందినది.

రెండు దశాబ్దాలకు పైగా శ్రీమతి కుముదినీదేవి ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ, ఇండియన్ కాన్ఫరెన్స్ ఆఫ్ సోషియల్ వర్క్ వంటి సేవాసంస్థల సభ్యురాలు; పదేళ్లు మున్సిపల్ కార్పొరేషన్‌లో పౌర ప్రతినిధి; ఐదేళ్లు శాసనసభలో ప్రజా ప్రతినిధి; సంవత్సరంపాటు నగర మేయరు పదవిని అలంకరించిన తొలి మహిళ; దీనజనులకు దయనీయ ప్రజలకు కుముద బాంధవుడి వంటి వ్యక్తి కుముదినీదేవి; రోడ్డుపై కుష్ఠురోగి కనిపించినా, భిక్షుకుడిని చూసినా, మురికిపేటలు ఎదురైనా హృదయం ద్రవించే వ్యక్తి.

ఆగర్భ శ్రీమంతులై, తెలంగాణా గడ్డపై లబ్ధ ప్రతిష్ఠులైన పింగిళివారి ఆడపడుచు కుముదినీదేవిగారు వరంగల్లు జిల్లాలోని వడ్డేపల్లిలో జన్మించారు. నిజాం హయాంలో నిస్తేజమైన తెలంగాణాలో విద్యా సౌరభాలను సదా పరిమళించేలా పరిశ్రమించిన పింగిళి వెంకటరామా రెడ్డిగారు ఆమె తండ్రి. హైదరాబాదులోని సెయింట్ జార్జి గ్రామర్ స్కూల్‌లో ఆమె మెట్రిక్ చదివారు; ఆతర్వాత కాలేజీల్లో చేరలేదు; డిగ్రీలు పొందలేదు. వనపర్తి రాజాగారైన రామదేవరావు గారితో ఆమెకు 17వ ఏట వివాహం జరిగింది; కూతురు సమ్మతిని పొందిన తర్వాతనే తల్లిదండ్రులు ఈ వివాహాన్ని జరిపించడం ఆ రోజుల్లో విశేష ప్రాధాన్యంగల విషయం.

శైశవంలోనే జాతిపిత గాంధీని ఆమె దర్శించుకున్నారు; జాతినేతల, ధార్మిక ప్రవక్తల ప్రవచనాలను ఆమె అతిశ్రద్ధగా ఆలకించారు; భారతీయ సంస్కృతి వైభవాన్ని గురించిన గ్రంథాలు పఠించారు. ప్రజాహిత రంగం పట్ల అపారమైన నిరతిని ఏర్పరుచుకున్నారు. కానీ, పెద్దల హితవును కాదన లేక రాజకీయ రంగంలో ప్రవేశించారు. పూర్వపు సికింద్రాబాదు మున్సిపల్ కార్పొరేషన్‌కు 1954లో తొలుత సభ్యురాలుగా నామినేట్ కావడంతో ఆమె రాజకీయ జీవితం ప్రారంభమైనది. 1956, 1960లో కౌన్సిలర్‌గా ఎన్నికయ్యారు.

శాసనసభకు తొలిసారిగా శ్రీమతి కుముదినీదేవి 1962లో వనపర్తి నియోజక వర్గంనుండి ఎన్నికయ్యారు. 1962 ఆగస్టులోనే ఆమె హైదరాబాదు మేయరుగా ఎన్నికై ఆ పదవికే రాణింపును సాధించారు. నగరంలో బిక్షుకవృత్తి మురికిపేటల నిర్మూలన, కుష్ఠురోగుల పునరావాస కల్పనకై అహర్నిశలూ శ్రమించారు. ఆ

## క్యాన్సర్‌కి కొత్త విరోధి!

మన వంటింట్లో దొరికే వస్తువు ఒకటి కాన్సర్‌వ్యాధిని అరికట్టటానికి సహాయపడుతుందంటే ఆశ్చర్యంగా ఉంటుంది. కాని, ఎలుకల చర్మాలమీద ఈ వస్తువు వాడగా దానికాగుణం ఉందని తెలిసింది. ఆ వస్తువు ఏమిటీ? పెరుగు!

బల్గేరియా వైజ్ఞానిక అకాడమీ వారు 455 ఎలుకల చర్మాలకి 'చర్మం కాన్సర్' తగిలించి తర్వాతవాటికి పెరుగులో ఉండే నిరపాయకర సూక్ష్మ క్రిములని ఇంజెక్షన్ ద్వారా ఎక్కించారు. సాధారణంగా ఎలుకలన్నీ చనిపోయేవే కాని 136 బతికాయి. చర్మంకాన్సర్ ఎండి, పెచ్చుగా ఊడి పడి పోయింది. తిరిగి చర్మం మామూలు స్థితికి వచ్చి రోమాలు కూడా వచ్చాయి.

ఇంతవరకూ చర్మంకాన్సర్‌కే ఈ 'మందు' పనిచేస్తుంది. ఇది ఎలుకలలోనే కాక మనుష్యులకీవర్తిస్తుంది.

పెరుగులోని 'సారాన్ని' వేరు చేసి తక్కిన రకాల కాన్సర్‌మీద ప్రయోగించి




చూస్తున్నారు.

హెచ్. ఎస్. హెర్మన్‌సోన్
(కాపీరైటు)

# రాణి కుముదినీదేవి

రోజుల్లోనే హైదరాబాదులోని వరద బాధితుల సహాయార్థం హుటాహుటిగా ఒక్కరే ఢిల్లీకి వెళ్లి నెహ్రూగారిని కలుసుకొని ప్రధాని నిధినుండి పెద్దమొత్తం విరాళం సేకరించిన సాహసి. నగరంలోని సహృదయ దాతల సహాయంతో కూకట్‌పల్లిలో కుష్ఠువ్యాధి చికిత్స కేంద్రాన్ని ఆమె స్థాపించారు. నేడు అక్కడ రెండువందలమందికి పైగా చికిత్స జరుగుతున్నది. యావత్ భారతావనిలో ఆదర్శప్రాయమైన కేంద్రంగా అలరారుతున్నది. ఈ చికిత్సాలయం నిర్వహణ శ్రీమతి కుముదినీదేవికి జీవిత సర్వస్వమైనది.

1967 ఎన్నికల్లో అదే నియోజక వర్గంనుండి మళ్లీ కాంగ్రెసు అభ్యర్థిగా 14420 వోట్ల మెజార్టీతో శాసన సభకు ఆమె ఎన్నికయ్యారు 'భగవంతుడి కృప, బీదప్రజల సహకారమే నా విజయానికి కారణం' అని అంటారు. 'రానున్న ఐదేళ్లలో మీరేమి సాధించదల్చుకున్నారు?' అని ప్రశ్నిస్తే శ్రీమతి కుముదినీదేవి ఇలా అన్నారు. 'నాది చాలా వెనుకబడిన నియోజక వర్గం. బీదప్రజలకు అధికారుల సహకారం లేకపోగా, భగవంతుడుకూడా కినుక వహించాడు. వర్షాలులేవు, క్షామపరిస్థితులు ఏర్పడ్డాయి. ఆహారధాన్యాల సరఫరా జరగడం లేదు. రోడ్లు సరిగ్గాలేవు. ప్రజలకు న్యాయం, జరగడానికి ప్రయత్నిస్తాను.'

సామాజిక ప్రయోజనంకన్న స్వార్థదృష్టి ఈనాడు ప్రబలుతున్నదని, అందువల్ల సర్వత్రా అసంతృప్తి కలుగుతున్నదని, ప్రణాళికలు ఆశించినంతగా ఫలవంతం కావడంలేదని ఆమె మరోప్రశ్నకు సమాధాన మిచ్చారు. రాజకీయాల కాటుపోట్లు భరించ లేని సున్నిత హృదయం ఆమెది; కించిత్ అప్రియమైన భాషణమూ భరించలేని అభిమాని: 'దాతృత్వం ప్రియవక్తృత్వం, ధీరత్వముచితజ్ఞతా' సహజసిద్ధంగా అబ్బిన వ్యక్తి, భూషణాలు, భేషజాలు లేని ఆమె వ్యక్తిత్వానికి 'సత్యాన్నాస్తి పరోధర్మః' అనుసూక్తి ఆమెకు కంఠస్యభూషణమైనది.

'ఈ రాజకీయాలపట్ల నా కెప్పుడూ వ్యామోహంలేదు. నాకోసం నేను ఎప్పుడూ ఎవ్వరినీ ఆశ్రయించలేను. నాకు నచ్చని పరిస్థితుల్లో రాజకీయాలకు దూరం కావడానికి వెనుకాడను. సమాజంకోసం మంచిపనిని చేసేటప్పుడు మామూలు ఉద్యోగినుండి ముఖ్యమంత్రి వద్దకూ వెళ్లి ప్రయత్నిస్తాను' అని శ్రీమతి కుముదినీ దేవి అన్నారు. ఆమె ప్రస్తుతం చేతి పరిశ్రమల ఎంపోరియం బోర్డుకు అధ్యక్షురాలు, సాయుధదళాల సంక్షేమ ఉపసంఘంలో సభ్యురాలు, మరెన్నో మహిళా సంస్థలకు సలహాదారు!

వయస్సు మీరాక, సంతానంగల స్త్రీలు రాజకీయాల్లో ప్రవేశించడంవల్ల, వారి పెంపకానికి, కుటుంబ పరిస్థితులకు కొంత అంతరాయం కలిగేమాట నిజమేనని ఆమె అన్నారు. ఆమెకు ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తె లున్నారు. భర్తతోపాటు పలుమార్లు ఆమె బ్రిటన్, జపాన్ వంటి పెక్కు దేశాల్లో పర్యటించారు. చిన్ననాడు టెన్నిస్ ఆమెకు హాబీ. ఈనాడు ఆధ్యాత్మిక గ్రంథాల పఠనం, ఆధ్యాత్మికం ప్రవచనాలు వినడం ఆసక్తి. ఆమెగదిలో వందలాది ఆధ్యాత్మిక గ్రంథాలు కన్పించాయి. ఢిల్లీకి వెళ్లినప్పుడల్లా హృషికేశ్‌లోని శివానంద ఆశ్రమాన్ని ఆమె సందర్శిస్తుంటారు. తాము నిర్వహిస్తున్న కుష్ఠురోగుల చికిత్సాలయాన్ని 'శివానందాలయం'గా, తాము నివసిస్తున్న భవనాన్ని 'శివానంద గృహం'గా నామకరణం చేశారు.

ఆకృతిలోనూ, ఆలోచనల్లోనూ, భాషణంలోనూ భారతీయతను భాసింపజేసే విదుషీమణి రాణి కుముదినీదేవి నాల్గేళ్లలో షష్ఠిపూర్తి కానున్నా, ముదిమి తొంగి చూడని ముదిత; గంభీరమైన ఆమె వ్యక్తిత్వానికి భూషణ ప్రాయమైన ఆమె స్మితము, సదాస్మృతం.

—దాసాని సుదర్శన్ రెడ్డి

వంటలు

## బియ్యప్పిండి హల్వా

| | |
|---|---|
| బియ్యప్పిండి | 1 కప్పు. |
| చక్కెర | 2 కప్పులు |
| వెన్న | సగం కప్పు |
| కుంకుమ పువ్వు | 3 చెంచాలు |
| పన్నీరు (గులాబి.) | |

చక్కెరపాకం పట్టాలి. వెన్న కరిగించి పిండి, పాకం కలిపి వేగనివ్వాలి.

కుంకుమపువ్వుని నీటిలో నానవేసిన తర్వాత చేర్చాలి. 15 నిముషాలు కలుపుతూ వండాలి. చల్లార్చి గులాబి పన్నీరు కలపాలి. ఎ. బి.



# జోక్యం

పాలడుగు వెంకటేశ్వరరావు

ఆ రోజు 'క్లబ్బు'లో ఏదో 'పార్టీ' వుండటమువలన వేణు ఇంటికి వచ్చేసరికి బాగా ప్రొద్దుపోయింది. 'బి. ఎస్సే'ని 'గేరేజి'లో పెట్టి ఇవతలకి వచ్చేటప్పుడు హాలులోని గడియారం పన్నెండు కొడుతున్నది. ఆ వెంటనే ప్రహారీ గోడని దాటి వచ్చిన సన్నటి 'ఏడ్పు' ఒక్క క్షణంపాటు అచేతనంగా నిల్చునేటట్టు చేసింది అతడిని.

ఆ ఏడ్పు గుండెల్ని చీల్చుకుని హృదయాంతరాలలోకి చొచ్చుకుని పోతూవుంది. అతనికి ఆ స్వరం చిరకాలంగా పరిచయం! ఎక్కడ? ఎప్పుడు ? !...అవును. నిజమే. వేణు ఆ స్వరాన్ని చాలా రోజులు ఆరాధించాడు, ఒకప్పుడు.

కాని ఈ విధంగా ఆ గొంతుని వినటం ఇదే ప్రథమం. అసలు ఆ సంగతి వేణు ఇదివరకు, లత ద్వారా విని ఉన్నాడు. అప్పుడు అంతగా పట్టించుకొని వుండలేదు ఆ సంగతి. అవును.

ఆ గొంతు రేఖదే! రేఖ ఏడుస్తూ వున్నది సన్నగా, బయటికి విన్పించకుండా అణిచిపెడతా. వేణు మెల్లిగా అడుగులువేసి వీధిలోనికి వచ్చాడు, అనియంత్రితంగా.

పచ్చగా అంతటా పరుచుకుని వున్న వెన్నెల వెలాతెలా పోతున్నది.

ఆ వెన్నెలలో బోసిగా దీనంగా నిలబడి వున్న ఆ ఇంట్లోనుంచే వస్తున్నది, ఆ రోదన ధ్వని.

ఆతురత, విచక్షణని మింగివేయగా గబగబా ఆ ఇంటివేపు నడిచాడు, వేణు.

అవును.

రేఖ ఏడుస్తూ వున్నది. చాలా రోజుల తరువాత వేణు తిరిగి రామారావు గొంతూ విన్నాడు. పరుషంగా దరాకుడుగా రామారావు గొంతు వినబడుతున్నది. కఠినంగా వున్న రామారావు మాటలు వేణు వినలేకపోయాడు. రామారావు ఏమి మనిషి? అందుకే రేఖ ఏడుస్తూ వున్నది. పాపం!

వేణు నీరసంగా ఇవతలకి అడుగులు వేసేడు. ఆ వాలుగు క్షణాలు వాళ్ళ మధ్యన వున్న అంతరం గురించి వేణు మరిచి పోయాడు. హృదయం మూతిగింది.

దాదాపు పదిహేను సంవత్సరాల కిందటి సంగతి, ఇది. ఆ రోజులలో వేణు బి. ఏ. చదువుతూ వుండేవాడు. వాళ్ల ఇంటి ప్రక్కనే ఒక 'సబ్ రిజిస్ట్రారు'గారు అద్దెకు

# జోక్యం

వుంటూ వుండేవారు. వారికి ఒక్కగానొక్క కూతురు రేఖ. గారాబంగా చూసుకునేవారు. చూసినకొద్దీ ఇంకా చూడాలనిపించే అందము రేఖది. గుండెల్ని బంధించివేసి వూపిరాడకుండా వుక్కిరి బిక్కిరి చెయ్యగల శక్తి ఆమె అందములో వుండేది.

అప్పుడు రేఖ 'స్కూలుఫైనలు' చదువుతూ వుండేది.

రోజూ ఒక్కసారయినా ఆ అమ్మాయిని చూడాలని అతని మనసు కుతూహలపడుతూ వుండేది. అలా కానినాడు మనస్సులో ఏదో వెలితిగా వుండేది. మనస్సు దీనంగా లోలోపలే ఏడిచేది.

రేఖని హృదయపీఠం మీద ప్రతిష్ఠించుకున్నాడు, పదిలంగా, రహస్యంగా.

రేఖని చూసి హృదయం ఆనందంతో వుక్కిరి బిక్కిరి అయేది.

అవును. రేఖని ప్రేమించాడు, వేణు నిండు మనస్సుతో.

ఆ రోజులలోనే వాళ్ళ క్లాసులో రామారావు అని వుండేవాడు. వొట్టి మొరటు మనిషి. ఆడపిల్లల్ని ఏడిపించటము తప్ప అతనికి వేరే పని వుండేది కాదని నలుగురూ అనుకునేవారు. ఒక్కో క్లాసులో సంవత్సరాల తరబడి వుంటాడట. అటులంటే అతనికి బాగా మక్కువట!

వేణుకు అతనంటే అంతగా ఇష్టం వుండేది కాదు. రోడ్డు వెంట నడుస్తున్నప్పుడు అతను ఒకటి రెండుసార్లు రేఖ వెనకనే నడవటం వేణు గమనించాడు.

వేణుకు అతనంటే వున్న 'అసహ్యత' రెట్టింపయింది.

చూస్తూవుండగానే కాలం దొర్లిపోయింది.

పరీక్ష లయ్యేయి.

'బి. ఏ.' పాసయాడు, వేణు.

ఆ మరుసటిఏడు వేణు ఇష్టంలేకపోయినా 'ఎమ్. ఏ.' కోసం విశాఖపట్నం వెళ్ళాల్సి వచ్చింది. రేఖని వొదలలేక వొదల లేక దిగులుగా వెళ్ళాడు.

'రేఖని చూడకుండా, నేను ఎట్లా వుండగలను?

నా గుండె పగిలి ప్రయ్యలు కాకుండా వుండగలదా? అంతటి మనోస్థైర్యము నాతో వున్నదా?

నేను ఏమయి పోతాను? భగవంతుడా, నన్ను రక్షించు. ఎందుకు ఈ పరీక్ష?'

అనుకున్నాడు. ఈ ఆలోచనలతో బుర్ర వేడెక్కి పోయింది వేణుకి.

అస్తవ్యస్తమయిన మనస్సుతో, చెదిరిన మనోధైర్యంతో, దీనంగా లోలోపలే కుమిలి పోతూవున్న హృదయంతో వెళ్ళిపోయాడు.

చాలా రోజులవరకు హృదయంలో రేఖ రూపమే మెదిలి మనోశాంతిని చెదరగొట్టుతూ వుండేది.

మూణ్ణెల్ల తరువాత దసరా సెలవులలో, రెక్కలు కట్టుకుని వచ్చి వాలేడు, ఆఘమేఘాలమీద, రేఖని చూడాలని. కాని నిరాశే ఎదురయింది. రేఖ కనపడలేదు. ఆ ఇంట్లో వాళ్ళు లేరు. ఇంట్లో వాళ్ళని విచారించగా తెలిసింది. వేణు విశాఖపట్నం వెళ్ళిన పదిరోజులకే, 'సబ్ రిజిస్ట్రారు' గారు వున్నట్టుండి వొకరోజున గుండె జబ్బుతో చనిపోయారట!

వెనకాల కూడబెట్టిన ఆస్తిపాస్తులేవీ లేకపోవటమువలన ఆ తల్లీ కూతుళ్ళు కొన్నాళ్ళ ఎంతో బాధపడినారట. ఆ తరువాత ఎవరో బంధువులు దయతలచి వాళ్ళని చేర దీశారట.

వాళ్ళు ఆవూరు వొదిలిపెట్టి పోయి అప్పటికి నెలరోజులు అయిపోయిందట. వేణు గుండెల్లో అగ్నిపర్వతాలు పగిలినాయి.

'నే నేమని ఆశించాను? చివరికి ఏమయినది? నా కేమవుతుంది? నా గుండె నిల ద్రొక్కుకుంటుందా? ఇదంతా ఇట్లా ఎందుకు జరగాలి? ఏమో' అని మథనపడ్డాడు వేణు.

చాలారోజులు పిచ్చివాడయి పోయాడు.

మనసులోని కోరికని బహిర్గతం చేయలేని తన బలహీనతని పదేపదే తిట్టుకున్నాడు. కాలకంఠుడు గరళాన్ని కంఠంలో వుంచినట్టు బాధని గుండెల్లో దాచి పెట్టాడు. ఎవరికీ సూచనగానైనా తెలియనివ్వలేదు. ఎవరికి తెలిసి చెయ్యగల సహాయమూ ఏమీలేదు, మరి!

వాళ్ళు ఏ వూరు వెళ్ళారో కూడా ఎవరికీ తెలియదట! విధి ఎంత కర్కశంగా వుంటుంది ఒక్కోసారి! నిజంగా, మనస్సు

అతి నిచ్చితమయినది. దాని పోకడని అంచెనా వెయ్యటానికి శతాబ్దాల తరబడి ఎందరో మనస్తత్వవేత్తలు ప్రయత్నాలు చేస్తున్నారు.

కాలంలో ఒకరకమయిన 'ఆ యింద్ర జాలికశక్తి' వున్నది.

ఎంతటి గాయాల్నయినా మాన్పగలశక్తి దానికి ఉంది. ఇది వాస్తవము.

'నామీద నాకే నమ్మకంలేక పోయిం దానాడు. నేనేమయి పోతానో నాకే అర్థం కాలేదారోజు, ఆగాయానికి నా జీవితం ముక్కలుగా అయి, చెదిరిపోతుందేమో అని అనిపించింది నాకు.

కాని,

నాకు ఏమీ కాలేదు.

కొద్దిరోజులలోనే రేఖని స్మృతిలో శిలా మాత్రంగానే వుండనిచ్చి మిగతా జ్ఞాపకాలు తుడిచి వేసుకున్నాను.

జీవనపథంలో పురోగమిస్తూ ముందుకు సాగిపోయాను.

నేను అంతగా ఆరాధించిన 'రేఖ' రేఖా మాత్రంగానే నా స్మృతి పథంలో మిగిలి పోయింది. నా ఆరాధనలోనే, లోపము వున్నదా? ఏమో?!

నేనొక సాధారణ మానవుడిని! కాలం నడిచింది.

ఎం. ఏ. పూర్తి చేశాక వ్యాపార నిర్వహణలో 'మాస్టర్సు డిగ్రీ' తీసుకున్నాను, ప్రథముడుగా పరీక్ష ప్యాసయి.

నా వివాహమూ అయింది మరి!' అని ఆశ్చర్యపడినాడు, వేణు గతాన్ని తల్చుకుని అప్పుడు.

తరువాత, ఒక ప్రయివేటు కంపెనీలో బ్రాంచి మేనేజరుగా ఉద్యోగం అయింది వేణుకి. హైదరాబాదులో నూతన జీవితానికి నాంది పలికాడు. పొదుపుడుకులకు సర్దుకుని అతని జీవిత రథం ఋజు మార్గాన నడుస్తున్నది, ఇప్పుడు.

ఒకరోజున 'క్లబ్బు'నుంచి తిరిగి వొచ్చే సరికి, వేణుకోసం ముఖ్యమయిన 'ఫైళ్ళు' ఇంటికి తీసుకుని వచ్చాడు ఆఫీసు వుద్యోగి ఒకతను.

వరండా చీకట్లో నుంచుని వుండటము వలన వేణు అతన్ని గుర్తించలేక పోయాడు. సంతకాలు పెట్టేశాక ఇంకా అతను అక్కడే నుంచుని వున్నాడు.

'క్షమించండి సార్! మీరు బందరులో చదివేవారా?' అన్న అతని ప్రశ్న, వేణు అతన్ని పరిశీలనగా చూసేటట్టు చేసింది.

వేణు అతన్ని గుర్తుపట్ట కలిగాడు.

అతను రామారావు!

ఆ రోజున రామారావు చాలాసేపు మాట్లాడి వెళ్ళిపోయాడు.

అతను ఆ ఆఫీసులోనే నాలుగు సంవత్సరాల నుంచీ పనిచేస్తున్నాడట.

ఎన్నిసార్లు ప్రయత్నించీ బి. ఏ. పూర్తి చెయ్యలేక పోయాడుట. వాళ్ళు వుంటున్నదికూడా ఈ పరిసరాలలోనేనట! పెళ్ళయిందట. ఇద్దరు పిల్లలట!

తనకు చాతనయినంతవరకూ రామారావు అభివృద్ధిలోనికి రావటానికి సహాయము చెయ్యాలని అనుకున్నాడు వేణు, అప్పుడు.

కాని తర్వాత అతన్నిగురించి వేణు విన్న సంగతులు ఆ అభిప్రాయాలకి వ్యతిరేకంగా తయారయినాయి.

రామారావు పనిగురించి మేనేజరు 'తేలిక'గా చెప్పాడు. అతనిలో 'సామర్థ్యత' లేదు!

వేణుకీ, ఆతరువాత తెలిసివచ్చింది. మేనేజరు చెప్పినదానిలో అసత్యము ఏమీలేదు. రామారావుని గురించి మంచిగా అనుకునే వాళ్ళు ఆఫీసులో బహు కొద్దిమంది మాత్రం.

రామారావుకి అన్ని దురలవాట్లూ వున్నవట! పనిలో అలసత ఎక్కువట.

అయితే రామారావుకి ఇప్పటికిన్నీ బాధ్యత అలవడలేదన్నమాట!

అతన్ని వేణు ఎంతగా అసహ్యించుకున్నా అతనికి సహాయపడాలని అతన్ని తప్పులనుండి కాపాడాలని అనిపించేది వేణుకి అంతరాంతరాలలో. అస్పష్టంగా ఆత్మీయత కదిలేది. కారణం అనూహ్యమే అయింది, వేణుకి బహుశా సహాధ్యాయి అనేమో!

మనస్సుకి సంబంధించిన కొన్ని విషయాల 'ఆనుపాను'లు ఇంకా శాస్త్రజ్ఞులు సరిగా అంచనా వెయ్యలేక పోయారు, ఇన్ని పరిశోధనలు ఇంతకాలంగా చేసిన్నీ.

కాని అతనిమీదగల తన అవ్యాజమయిన జాలికి బలవత్తరమయిన కారణం వున్నదని ఆతరువాత కొద్దిరోజులలోనే తెలిసింది వేణుకి.

— అష్టమం.

రామారావు ఎడల వేణుకిగల ఆ భావానికి కారణము వున్నది.

వేణును ఆ వేసవిలో చూడటానికి, వాళ్ళ అమ్మ వచ్చింది హైదరాబాదుకు. వాళ్ళ వూరునుంచి.

ఒకరోజు వేణు ఆఫీసునుంచి వచ్చాక ఆవిడే స్వయంగా ఆ విషయం కదిలేసింది.

'నువ్వు బందరులో బి. ఏ. చదువుకుంటూ వున్నప్పుడు మన ఇంటిప్రక్కన 'సబ్ రిజిస్ట్రారు' గారు వుంటూవుండేవారు. గుర్తువుందా?' అని అన్నది.

ఆశ్చర్యపోయేడు వేణు. మనస్సు తిరిగి ఇన్నాళ్ళకి తియ్యగా బాధతో మూలిగింది.

'అవును. ఏం?' అన్నాడు.

'రేఖ వాళ్ళ అమ్మాయి. అప్పుడు స్కూల్ఫైనల్ చదువుతూ వుండేది. గుర్తువుందా?' అంది అమ్మ.

అతనిలో ఇన్నాళ్ళూ ఘనీభవించి వున్న ఆలోచనలు కరిగి నీరయ్యాయి. ఆ నీటి అంచున ప్రతిఫలించిన మెరుపువలె రేఖ కదలాడినది.

మొన్న ఆ అమ్మాయి ఇక్కడ కనబడింది. మొదట నేను ఆనవాలు పట్టలేదు. అంతగా మారిపోయింది. భర్తకి ఈ వూళ్ళోనే వుద్యోగమట! నన్ను చూసి ఎంతో సంతోషపడింది పిచ్చిపిల్ల. వాళ్ళ ఇల్లూ ఇక్కడికి బాగా దగ్గరే. పాపం వాళ్ళ అమ్మ కూడా ఈ మధ్యే పోయిందట!

నిన్ను గురించి ఎంతగానో అడిగింది.

'అన్నయ్య బాగావున్నాడా పెద్దమ్మా?' అని ఎంతో ఆప్యాయతగా అడిగింది.

నిన్న మనింటికి వచ్చింది. నువ్వేమో మద్రాసు వెళ్ళివున్నావు.

నిన్ను చూడాలని ఎంతో ఇదయింది. కానీ నువ్వు రాలేదు, ఆ రోజున...'

అమ్మ అట్లానే చెప్పుకుంటూ పోతున్నది, వేణు ఆలోచనలలో పడ్డాడు. మనస్సులో గడ్డకట్టివున్న మంచు కరిగింది. విడిపోయింది.

అన్నయ్య!

తను రేఖ దృష్టిలో అన్నయ్య! ఆ సంగతి గుర్తించలేకపోయాడు, తను.

నిజంగా అది తన దృష్టిలోని లోపమేనేమో!

నిజంగా ఆ భావన ఎంత మధురమయినది? 'అన్నయ్య' అన్న మాటలో ఎంత

శక్తి వుంది?!

అందులో ఎంత స్వచ్ఛత !

ఆనాటికీ ఈనాటికీ ఆమె దృష్టిలో తను అన్నయ్యే!

ఇన్నాళ్ళూ అది కానకనే, రేఖని మరో దృష్టితో చూశాడు. ఆ సంగతి తెలిసి ఇప్పుడు అభిప్రాయం మార్చుకున్నాడు. మనస్సులో పన్నీరు చిలకరించినట్లైంది.

తనకి రేఖ చెల్లెలు! తోబుట్టువులులేని తనకి దైవమిచ్చిన చెల్లి రేఖ !

ఈ భావన ఎంతో తృప్తినీ, శాంతినీ ప్రసాదించింది. మనస్సులో నిర్మలమయిన అనిర్వచనీయమైన ఆనందము. స్వార్థరహితమయిన భావన నిజంగా ఉన్నతమైనది.

కాని ఆ ఆనందము ఎక్కువ కాలం నిలువలేదు. అవసరమయిన పని వున్నందువలన వేణు వాళ్ళ అమ్మ తిరిగి వూరు వెళ్ళిపోయింది, నెల రోజులకే. ఆఫీసు బాధ్యతలు ఎక్కువయ్యాయి. మనస్సు ఎంతగా కోరుతూవున్నా వేణుకి రేఖని చూడటము పడనేలేదు.

ఒకనాడు 'లత' అన్నది.

'మీకు రేఖ అనే అమ్మాయి తెలుసునా ?'

అవునన్నట్లు తలాడించాడు, వేణు యాంత్రికంగా.

'ఇవ్వాళ ఆ అమ్మాయి మన ఇంటికి వచ్చింది. ఈ మధ్యన చాలా రోజులు జబ్బుతో తీసుకుందట. మీరూ, మీ అమ్మగారూ వాళ్ళకి బాగా తెలుసట గదా! నేను మరిచిపోయాను. ఆ మధ్యన ఒకసారి మన ఇంటికి వచ్చిందట, మీ అమ్మగారువున్నప్పుడు. ఆ అమ్మాయి భర్త మీ కంపెనీలోనే వుద్యోగం చేస్తున్నాట్ట! ఇందాక మాటల మధ్య తెలిసింది.

వాళ్ళు వుంటున్నది కూడా ఇక్కడే. మన ప్రహరీగోడ అవతలి ఇల్లేనుట. ఆమె భర్త మీకు తెలుసునా?' అన్నది లత.

వేణు తెల్లమొహం వేశాడు. 'మా ఆఫీసులోనే పనిచేస్తూవున్న రేఖ భర్త ఎవరు? నిజంగా నాకు తెలియదు! మరి!' మథన పడ్డాడు.

తమాయించుకుని వెంటనే, 'అవును. ఏం?' అన్నాడు.

లత లంది, 'ఆ అమ్మాయి పెదవి విప్పి చెప్పలేదు గాని, నలుగురూ చెప్పేదాన్ని

## జ్యోత్స్న

బట్టీ, అడపా దడపా చెవులారా వింటున్న దాన్నిబట్టీ, అనవలసి వస్తున్నది. అతని ప్రవర్తన మంచిది కాదట. తాగివచ్చి భార్యని కొడతాడట. ఇంటి విషయాలేమీ పట్టించుకోడట. జీతం డబ్బులు మొదటి వారంలోనే తగలేస్తాడట.

కళ్ళు లోపలికి పీక్కుపోయి పూచిక పుల్లలాగా వున్నది, ఆ అమ్మాయి. పాపం ! దీనత్వం గూడుకట్టుకుని వున్నది. అతన్ని మీరు మందలించలేదా ? అతను మనిషేనా?' లత నిజంగా పాతకాలపు మనిషి.

మౌనంగా వుండిపోయాడు వేణు. మనస్సు బాధగా మూలిగింది.

'అతను ఎవరో తెలియదు. తెలిసినా ఏమని మందలించను? ఎట్లా మందలించను?' అనుకున్నాడు.

ఆ మర్నాడే తెలిసింది. మేనేజరు ఫిర్యాదు చేశాడు, రామారావు గురించి.

రామారావు 'ఆఫీసుడబ్బు' స్వంతానికి వాడుకున్నాడట! మేనేజరు అతన్ని లెక్క అడిగితే తలవంచుకుని మాట్లాడడట!

ఆ విషయం వేణుదాకా వచ్చింది.

వేణుని చూసి బిక్కమొహం వేశాడు రామారావు.

మొహం వాచేటట్లు చివాట్లు వేస్తాడని అనుకున్నాడు కాబోలు. వేణుకి జాలివేసింది. ఎవరూ చూడకుండా, తన జేబులోనుంచి డబ్బు తీసి అతనికి ఇచ్చి మేనేజరుకి కట్టమని పంపించాడు రామారావుని.

మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు రామారావు. వెనక్కి తిరిగి చూడలేదు.

ఆ మర్నాటినుంచీ అతను ఆఫీసుకి రాలేదు.

వేణు ఇచ్చిన డబ్బు మేనేజరుకి కట్టనూ లేదుట!

రామారావు ఏమయి పోయాడు ? అతను ఏమి మనిషి ?! అతను బాధ్యతని ఎప్పుడు గుర్తిస్తాడు? అతని చంచలమయిన బుద్ధి అతని జీవితాన్ని ఎక్కడికి తీసుకు వెడుతుంది!! అతన్ని నమ్ముకుని వున్నవాళ్ళు ఏమయిపోవాలి ?!

ఆ రోజుల్లోనే 'పులిమీద పుట్ర' లాగు ఇంకో సంగతి తెలిసింది, వేణుకి.

రేఖ భర్త రామారావేను అని!

అతని బాధ రెట్టింపయింది.

'పాపం! ఆ అమ్మాయిని చూస్తే జాలి వేస్తుంది. మీ కిందే పనిచేస్తున్నాడట గదా! ఈ విషయంలో మీరు కలుగజేసుకుని మందలించి ఒకదారికి తీసుకురాలేరా ?' అన్న లత మాటలు చెవుల్లో గింగురుమని మ్రోగుతున్నాయి.

కాని తను రామారావుని ఏమని మందలించగలడు? తన మాటని అతను లెక్క చేస్తాడా? బెదిరింపులతో అతన్ని లొంగదీయగలడా? అయినా అతని స్వవిషయాలలో జోక్యం కలిగించుకోవటానికి తనకు ఏమి హక్కు వున్నది?

'ఇది నా స్వవిషయం. రేఖ నా భార్య. నేను చెడ్డవాడినే కావచ్చును. తాగుబోతునూ పేకాటగాడినీ కావచ్చును. నా భార్యా బిడ్డల్ని బాధపెడుతూ వుండవచ్చును. నేను నరరూప రాక్షసుడినే. పతనం చెందినవాడినే అయివుండవచ్చును.

మీరు నా అధికారులూ కావొచ్చును. నా వుద్యోగం వూడగొట్టగల శక్తీ వుండవచ్చు మీకు. అంతమాత్రాన నా కుటుంబ వ్యవహారాల్లో తల దూర్చటానికీ, మా భార్యాభర్తల మధ్య తల దూర్చటానికి మీకేమి హక్కు వుంది? ఇందులో మీ స్వార్థము ఎంత?! అసలు మీరెవరు? రేఖ మీద అంతటి జాలి కలిగివుండటానికి కారణమేమిటి?' అని రామారావు తన్ను అడిగితే తన దగ్గర ఏమి సమాధానం వున్నది? ఆ రోజుల్లో, తనూ రేఖని ఆరాధించిన సంగతి రామారావుకి తెలియదనుకోలేదు. దొంగని దొంగ పట్టుకోగలడు, మరి! అందుకే మాట్లాడకుండా వూరుకున్నాడు వేణు. అపార్థం చేసుకోనటము చాల తేలిక గదా! అయినా ఏమి చెయ్యటానికీ రామారావు కనపడితే గదా?

ఏ బెదిరింపుని ఆయుధంగా వుపయోగించి అతన్ని మార్చాలని లత వేణుని కోరిందో, ఆ బెదిరింపే రామారావు అకారణంగా వేణు మీద వుపయోగిస్తున్నాడిప్పుడు.

రామారావు అట్లా నిర్లక్ష్యంతో వుద్యో

గాన్ని వొదిలి పతనంచెంది వివాహానికో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు వేణుకి బుర్ర వేడెక్కి పోయింది.

భార్యని సంసారాన్ని ఏమిచేద్దామని అతని వుద్దేశ్యం ?

అటువంటి దుర్బల మనస్కులకూ చపల చిత్తులకూ వివాహమనే హక్కును సంఘం ఎందుకు నిరాకరించదు? ఏమో?!

ఆలోచనలతో బుర్ర వేడెక్కి పోయింది.

రేఖ ఏమవుతుంది? రామారావు ఆ అమ్మాయిని ఏమిచేస్తాడు? ఈ సమస్య ఎట్లా పరిష్కారమవుతుంది? కొందరు పిచ్చివాళ్లు సమస్యలు సులువుగా సృష్టిస్తారు.

అదే విషయమయి లత కూడా ఎంతో బాధపడింది.

మగవాళ్ళ హృదయ కఠినతని గురించి లత విమర్శిస్తూవుంటే అందుకే నోరు మెదపకూడా వూరుకున్నాడు వేణు. ఒకదారి చూపి రేఖని రక్షించమని దేవుణ్ణి ప్రార్థించాడు మనస్సులోనే.

అట్లా అదృశ్యమయి పోయిన రామారావు గొంతుని తిరిగి ఈరాత్రి ఈ విధంగా వినవలసి వస్తుందని అనుకోలేదు వేణు, కలలో గూడా. అదివిని గుండె బాధగా మూలిగింది. అసహాయంగా అడుగులువేసి ఇంట్లోకి వచ్చేశాడు వేణు.

అతనికి, రాత్రి రెండయినా కనులు మూతపడలేదు.

ఆ మర్నాడు వేణు లేచేసరికి ఎనిమిదయింది.

'ఇవ్వాళ మీరు ఎక్కడికీ వెళ్ళకండి.' అని ఆజ్ఞ జారీచేసింది లత.

కారణం అడిగితే చెప్పలేదు.

సుమారు పదిగంటల ప్రాంతంలో రామారావు వచ్చాడు. మనిషి ఎంతో చిక్కిపోయాడు. వేణుకి ఆశ్చర్యము కలిగింది. నిర్మలంగా వున్న అతని మొహంచూసి ఆనందమూ కలిగింది. రామారావు చెప్పిన మాటలు ఆనందం కలిగించాయి! వేణుకి.

తన, గతప్రవర్తన గురించి ఎంతో సిగ్గుపడుతున్నాడట రామారావు. ఏదో పిశాచం, తన నావహించి తన చేత ఆ విధంగా చేయించిందట! తను ఎంతో ఆరాధించి ప్రేమించి పెళ్ళిచేసుకున్న రేఖని ఇన్నిబాధలు పెట్టింది తనేనా అని ఆశ్చర్యమూ కలుగుతున్నదట! 'వేణు, దంపతులు' తమ సంసారాన్ని తిరిగి నిల బెట్టారట !.

ఎంతో బాధపడుతూ అంతా చెప్పి కళ్ళ వెంట నీళ్ళు పెట్టుకున్నాడు రామారావు.

ఈ ఉద్యోగం చెయ్యటం ఇక తనకి ఇష్టంలేదట! ఒకటి రెండు రోజులలో వాళ్ళవూరు వెళ్ళిపోతున్నారట. 'వ్యవసాయం చెయ్యదల్చుకున్నా'నని అన్నాడు రామారావు వేణుతో.

రామారావులో ఇంతమార్పు ఎలా వచ్చిందో, అంతరాంతరాలలో ఎక్కడో మూలను గాఢ నిద్రలోవున్న అతనిలోని 'మనిషి'ని ఎవరు ఎట్లా మేల్కొలిపారో అర్థంకాలేదు వేణుకి! తనూ, తనభార్యా వాళ్ళ సంసారాన్ని ఎట్లా నిలబెట్టారో అసలే అర్థంకాలేదు వేణుకి!!

కారణం ఏమయినా, రామారావులో కలిగిన ఈ పరివర్తన శుభోదర్కమయినది. అందరికీ ఆనందదాయకమయినది. మనస్సులో పన్నీరు చల్లినట్లయినది. రేఖ సంసారం అట్లా కుదుటపడటం సంతోషం కలిగించింది వేణుకి.

ఆ రోజు చాలాసేపు మాట్లాడిన తరువాత తిరిగి వెళ్ళిపోయాడు రామారావు.

ఆ మరునాటి తెల్లవారుఝామున కలత నిద్రలోవున్న వేణు చెవులకి వెనుక దొడ్లోనుంచి కొన్నిమాటలు వినబడినాయి.

'వొదినా! నిన్ను వొదిలి వెళ్లాలంటే నాకేదో దిగులుగావుంది. నువ్వు నిజంగా దేవతవి. నువ్వు కలుగచేసుకోక పోయినట్లయితే నా సంసారం ఏమయేదో? తోటి స్త్రీగా నా కష్టాలని అర్థం చేసుకున్నావు. తాత్కాలికంగా, నీమాటలు ఆయనలో 'అసహ్యం' కలుగచేసినా ఆ వెంటనే పెద్ద మార్పును తెచ్చాయి. ఆనాటి, నీమాటల 'తీక్షత'కి ఆయనేకాదు ఎవరయినా మారి తీరుతారు. ఇందుకు నేను నీకు ఆ జన్మాంతము కృతజ్ఞురాలిని...' రేఖ గొంతుక.

ఆశ్చర్యపడుతూ లేచి కూర్చున్నాడు వేణు, పక్కమీద.

'అంతమాట లెందుకుగానీ, అమ్మాయ్! మీ ఆయన మారినందుకు నాకు సంతోషంగా వున్నది. ఉండు. మీ అన్నయ్యని లేపుతాను. ఆయనకి మీరు వెళ్ళిపోతున్నట్లు ఇంకా తెలియదు.' లత అంటున్నది.

నిజంగా ఆడవాళ్లు ఎంతకయినా సమర్థులు!

వేణు, గబగబా లేచివెళ్లాడు దొడ్లోకి. అన్ని సంవత్సరాల తరువాత రేఖని చూసి వేణుకి కన్నీరు తిరిగింది.

రేఖ కన్నీటితో వేణు పాదాలకి నమస్కారం చేసింది. రేఖకి పసుపుకుంకుమలతో చీరా, పిల్లలకి బట్టలూ, రామారావుకి పంచలచాపూ—లత వీటిని రేఖచేతిలో పెట్టింది. తర్వాత తనూ వచ్చి వాళ్ళ దగ్గర సెలవు తీసుకున్నాడు రామారావు కన్నీటితో. రామారావు, రేఖ, పిల్లలతో కదిలి వెడుతూవున్న బండిమీద, అప్పుడే తూర్పు దిక్కునుండి సంధ్య రాలుస్తున్న ఎర్రనిరేఖలు పడినవి. ●



### జరిగిన కథ

పరీక్షహాలులో కాపీలు రాస్తూంటే పట్టుకున్న శంకరం మాస్టారిమీద విద్యార్థులు పగతీర్చుకో జూస్తున్నారు. వేణుకు మరీ కోపంగావుంది. వేణు అక్కయ్య జ్యోతి. శంకరం మాస్టారి మంచితనాన్ని గ్రహించిన జ్యోతి, గోపీని ఆయనదగ్గరకు ట్యూషనుకు పంపిస్తుంది. గోపీ అయిష్టంగానే వెళ్తుంటాడు. జ్యోతి స్నేహితురాలు రాధ. రాధ వాళ్ళన్నయ్య మోహన్. మోహన్ జ్యోతి ప్రేమించుకున్నారు. జ్యోతి శంకరం మాస్టారి భార్య పార్వతితో పరిచయం ఏర్పరచుకుంది. వేణు బృంధానికి క్రికెట్ ఆడుకోడానికి వసతులు కల్పిస్తాడు శంకరం.

## సీరియల్

# ప్రజ్ఞా సంజ్ఞా ప్రభాతం...

**తేజోవతి**

## 5

సాయం సంధ్యవేళ. మంచి ఎండాకాలమేమో పొద్దు పడమటకు వాలినా వడగాడ్పులు తగ్గలేదు. వాకిట్లో అంతా నీళ్ళు చల్లింది పార్వతి. జామచెట్టుక్రింద మంచం వాల్చుకు కూర్చుని [illegible] పేపర్లు దిద్దుతున్నారు శంకరంగారు. ఒక్కో పేపరు చూస్తూంటే ఆయనకు నవ్వు కూడా వస్తోంది.

పేపరుదిద్దే 'ఎగ్జామినర్'కే టోపీ పెట్టగల మనుకుంటారు కొందరు, వాళ్ళు వ్రాసిన జవాబులు వాళ్ళ 'సొంతమేనందీ, బైహార్ట్ చేసిందీ, లేకపోతే కాపీకొట్టిందీ కనుక్కోలేరని కొందరు విద్యార్థుల అభిప్రాయం. 'ఒరేయ్! ఆ స్టోరీ మర్చిపొయ్యామురా...అయినా 'గస్ అండ్ గాస్' కొట్టాములే..రెండు పేజీలు పైనే వచ్చింది...పాస్ ష్యూర్ అనుకో'...అంటూ వూహించుకుంటాడో విద్యార్థి. తాము వ్రాసిన పేజీ లనుబట్టి మార్కులు పడతాయనుకొని ఆ పిచ్చిభ్రమతో, తాటికాయలంతేసి అక్షరాలతో రెండంగుళాల కోపంక్తి చొప్పున వ్రాసి తాము పాసవకపోతే సెంటరు మొత్తం మీద ఎవరూ పాసవలేరని ఛాలెంజి చేస్తారు మరికొందరు. రెండో కంటివాళ్ళకు తెలియకుండా కాపీకొట్టామని గర్వంగా చెప్పుకుంటారు మరి కొందరు!

శంకరంగారికి వేణు జ్ఞాపకం వచ్చాడు. అసలు కాపీ కొట్టడానికి మూడు కారణాలుంటయి...మొదటినుంచీ చదవకుండా తీరా పరీక్షరోజుల్లో హడావుడిపడి, ఆ హడావుడి చాలదేమోనని భయపడి కాపీ కొట్టేవాళ్ళు కొందరు, తాము కొంత కష్టపడి చదివినా, తమ జ్ఞాపకశక్తిమీద నమ్మకంలేక 'సేఫ్ సైడ్'గా కాపీ కొడ్తారు యింకొంతమంది, అదేదో అద్భుతమైన, సాహసకృత్యమనీ, ఆ ధైర్యంలేనివాళ్ళే ఏడాదిపొడుగునా చదువుతారనీ మరికొందరు విద్యార్థుల వుద్దేశ్యం ... ఏది ఏమైనా కష్టపడి చదివినా పాసు కాలేని కుర్రాడు కాపీకొట్టడనీ, కొట్టలేడనేది శంకరంగారి అభిప్రాయమూ, అనుభవమూ కూడా...అందుకే రత్నంలాంటి కుర్రాడు వేణు చెడుసావాసాలతో చెడిపొయ్యాడు కానీ..అనుకున్నారు.

మరోపేపరు తీశారు శంకరంగారు: జవాబులన్నీ కంఠస్థంపెట్టి బాగానే వ్రాశాడు కుర్రాడు. కానీ 'యానిటేషన్సు, జనరల్ క్వశ్చన్సు' వచ్చేసరికి అన్నీతప్పులే. స్వంతగా వ్రాయమంటే ఒక్కవాక్యం సరిగ్గా వ్రాయలేరు ఎందుకని?...ఇలా వ్రాయలేక పోవడానికి విద్యార్థుల బాధ్యత ఎంతవరకు అని ఆలోచించారు శంకరంగారు...ఇందులో తప్పు విద్యార్థుల దనిపించలేదు ఆయనకు...పిల్లలకు చిన్నతనం నుండి స్వయంగా ఆలోచించగల్గడం, స్వంత వాక్యాలతో జవాబులు వ్రాయగల్గడం నేర్పితే వాళ్ళెందుకు వ్రాయలేరు?...కాని యీ రోజుల్లో ఎంతమంది వుపాధ్యాయులు అలాంటి శిక్షణ యివ్వగలుగు తున్నారు? 'స్టోరీలు' యివ్వడం 'బైహార్ట్' చెయ్యమనడం,...దీనివలన విద్యార్థుల ఆలోచనా శక్తి ఎలా వృద్ధిపొందగలదు?...భాషా జ్ఞానం ఎలా అభివృద్ధి కాగలదు.?

అలా అని తప్పంతా వుపాధ్యాయులదే నని అనడానికి శంకరంగారి మనసొప్ప లేదు...రోజురోజుకు పెరుగుతున్న పన్నుల భారంలా, ఆయేటికాయేడు పెరుగుతున్న సిలబస్‌ను ఎలా పూర్తిచెయ్యాలో తెలియక, సెక్షనుకు యాభైఐదు మందిదాకా పిల్లలున్న క్లాసులో వాళ్ళ ఇంగ్లీషు భాషాజ్ఞానం వృద్ధిపొందించడానికి (యాక్టివ్ వొకాబులరీ) పెంపొందించడానికి లాంగ్వేజి డ్రిల్లు యివ్వడానికిగానీ వాళ్ళకు వీలెక్కడ? అటు 'సిలబసు'కు యిటు 'నియమిత కాలానికి' సంధి కుదర్చలేక ఇంగ్లీషు పాఠాలను తెలుగులో పురాణం చెప్పినట్లు చెప్పుకుపోయి 'సిలబస్' పూర్తిచేశామని పిస్తున్నారు వుపాధ్యాయులు. ఓతట్టు నిత్యదారిద్రంతో వేగుతూ, ఓవైపు వారానికి ఇరవైఆరు, యిరవై ఎనిమిది 'పీరియడ్స్' దాకా తీసుకుంటూ, కరెక్షను వర్క్‌కు 'ఫ్రీ పీరియడ్స్' చాలక తన్నుకుంటున్న వుపాధ్యాయులకు, యిక, ఒక్కొక విద్యార్థిమీద శ్రద్ధ చూపించి, వాళ్లవాళ్ళ మనస్తత్వాలనుబట్టి తగినశ్రద్ధ తీసుకుని, ప్రతిపిల్లవాడి తప్పు దిద్దగల తీరిక ఎలా చిక్కుతుంది? ఈ సమస్యకు పరిష్కారం ఏమిటో అనుకుంటూ బరువుగా నిట్టూర్చారు శంకరంగారు.

ఇంతలో వీధి వాకిలి చప్పుడైతే తలెత్తి చూసిన శంకరంగారు ఆశ్చర్యపొయ్యారు. చప్పునలేచి 'రండి... రండి.....వరదరాజులు గారు...'అంటూ ఆహ్వానించారు.

వరదరాజులుగారికి నాలుగు పదుల వయసుంటుంది. తల సగానికిపైగా నెరిసింది. మనిషి కాస్త స్థూలకాయుడు. శంకరంగారి వీధికి ఆయన ప్రక్కవీధిలోనే వుంటున్నా యింతవరకూ ఎప్పుడూ శంకరంగారింటికి రాలేదు. దానికి కారణాలు చాలా చెప్పుకోవచ్చు. ఒకటి...స్కూల్లో పిల్లలు శంకరంగారికిచ్చిన గౌరవం వరదరాజులగారి కివ్వక పోవడం. అది ఆయనకు కొంచెం కష్టం కలిగించివుండవచ్చు. ఇంకోటి వరదరాజులు

గారు హెడ్‌మాస్టరుగారికి కుడిభుజం లాంటివారు. అందుకని మిగతా స్టాఫ్ అంతా ఆయన్ను మంచిచేసుకోడానికి ప్రయత్నిస్తుంటే శంకరంగారు అలాంటి ప్రయత్నాలేవీ చెయ్యకపోవడం, మూడోది శంకరంగారు ముఖప్రీతి మాటలకు బదులు వున్నమాట మొహాన అనెయ్యడం.. ఒకసారి అతిముఖ్యమైన స్కూల్‌ఫంక్షనుకు వరదరాజులుగారు పావుగంట లేటుగా వచ్చారు. 'మనకాలేని క్రమశిక్షణ విద్యార్థులకు రమ్మంటే ఎలా వస్తుందని?' శంకరంగారు స్టాఫ్‌రూమ్‌లో సూటిగా అడిగేశారు... మరోసారి ఎవరో కుర్రాడు పాఠం చదవ లేదని వరదరాజులుగారు నానాతిట్లూ తిట్టడం విన్నారు శంకరంగారు. 'విద్యార్థుల్ని మందలించడంలో కూడా కాస్త సభ్యత పాటించాలి మనం. మనమే సభ్యత మర్చిపోతే విద్యార్థులు ఎవరినిచూసి నేర్చుకుంటారు?' అని మొఖాన అడిగేశారు... అప్పటినుండీ ఆయన శంకరంగారి మొహం కనబడితే పక్కకు తిప్పుకుంటారు ... అటు వంటాయన యివ్వాళ యింటికల్లా వస్తే శంకరంగారు ఆశ్చర్యపోవడంలో తప్పేమీ లేదు.

ఆయన్ను చూడగానే శంకరంగారు ఎదురువెళ్ళి తీసుకువచ్చి కుర్చీవేశారు... వరదరాజులు కూర్చుంటూ నాలుగువైపులా పరికించి చూశారు...కృత్రిమంగా నవ్వుతూ... 'పూలమొక్కలవీ వేసినట్లున్నారే... పెద్ద తోట తయారుచేశావ్...' అన్నారు.

'ఆఁ... పెద్ద తోటేముంది!...ఏదో నాలుగు పూలమొక్కలు వేశాం అంతే...' అని అంటూ ఆయనకు దగ్గరగా మంచం జరుపుకు కూర్చున్నారు శంకరంగారు.

వరదరాజులుగారు ఏవో ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పడం మొదలెట్టారు. శంకరం గారు ఊరికే 'ఊఁ' కొడుతున్నారు. ఆ మాటా యీమాటా మాట్లాడాక 'ఏఁమయ్యా శంకరం!...ఎవరో కుర్రాళ్ళకు ప్రైవేటు చెబుతున్నావుటగా?...' అని అడిగారు ఎరగనట్లే...అలా అంటున్నప్పుడు ఆయన ముఖంలో చిన్న మందహాసం, గర్వంతోకూడిన మందహాసం తొంగి చూసింది. దానిక్కారణం యిదివరలో శంకరంగారు ఎప్పుడూ ట్యూషన్సు చెప్పేవారు కారు. అలా అని ఆయనెప్పుడూ 'ట్యూషన్సు' చెబుతున్నవాళ్ళను విమర్శించేవారుకారు. ధరలు ఆకాశాన్నంటుతున్న యీ రోజుల్లో విధిలేకనే అలా చెప్పవలసి వస్తున్నదని ఆయనకు తెలియకపోలేదు. కానీ వరదరాజులుగారికి శంకరంగారు తమ మార్గం తొక్కలేదని యిన్నాళ్ళనుండీ వుండేది. అందుకే యివ్వాళ ఆయన మాటల్లో యద్దేవా వుంది. 'ఏనాటికో నాటికి నువ్వూ నా మార్గమే తొక్కావు' అన్న గర్వమూ వుంది.

'ఏబ్బే లేదండీ...ఒక్క కుర్రాడు మాత్రం



# ఘోరాః సంధ్యా ప్రవర్తతే..

వస్తున్నాడు...అదీ...ఏవో తెలియనివి చెప్పించుకు పోతుంటాడు...'!

'ఎవరా కుర్రాడు?'

'వేణుగోపాల్ అని...ఇదివరకు మన స్కూల్లోనే చదువుకున్నాడు...'

'వాడా!...ఆ వేణాయ్!...నా పక్కనేగా వాడు!...వాడ్ని కాపీ కొడ్తుంటే పట్టుకున్నావుటగా మొన్న పబ్లిక్ పరీక్షల్లో?' అని అడిగారు వరదరాజులుగారు పెద్దగా... ఆయనకు పెద్దగా మాట్లాడం అలవాటు. క్లాసులో పాఠం చెప్పేటప్పుడు ఎంతపెద్దగా అరిచి చెబుతారో మామూలుగా మాట్లాడేటప్పుడూ యించుమించు అంత పెద్దగానూ మాట్లాడుతారు.

'ఆఁ...ఆతడేనండి...ఏదో సావాసదోషాన గానీ...లేకుంటే మంచి చురుకైన కుర్రాడులా కనబడుతున్నారు...' అన్నారు శంకరం గారు. ఆయన ఎప్పుడూ పెద్దగా మాట్లాడరు. క్లాసులోగూడా అదేస్థాయిలో పాఠం చెబుతారు. అందుకే పిల్లలు చాలా నిశ్శబ్దంగా వుంటారు ఆయన క్లాసులో—

'ఏం సావాసదోషమయ్యా?...వాడు పచ్చి రౌడీ అవుతేను!...వాడ్నిగురించి నీకేం తెలుసు? క్లాసులో గోలగోల...మనమంటే అసలు గౌరవంమాట అటుంచి ఎంతనిర్లక్ష్యం, ఎంత తలపొగరు?...అన్నీ దురలవాట్లే. సిగరెట్లు కాలుస్తుంటే నా కళ్లారా నేను చూశాను...పైగా ఆ చెడ్డకోతి వనమంతా చెరిచిందిట...అలాంటివాడు...ఏడాదిమొత్తుకుంటే నా తరంకాలేదు వాడ్ని బాగు చెయ్యడం...'

శంకరంగారు 'ఊఁ!'...అనలేదు. 'ఆఁ', అనలేదు... 'ఇప్పుడు అతడ్ని ప్రసక్తి ఎందుకు యీాయనకు' అని మాత్రం అనుకున్నారు. శంకరంగారు మాట్లాడక పోవడంతో మళ్లీ వరదరాజులుగారే అన్నారు...

'ఇదో నే చెబుతున్నా విను...వాడికి చదువూ సంధ్యా వంటబట్టే మాట అబద్ధం...నువ్వు వెయ్యేళ్ళు... వెయ్యేళ్ళు... ప్రయత్నం చేసినా వాడ్ని బాగుచెయ్యలేవు...అసలిటువంటి దౌర్భాగ్యవెధవలకు మంచి చెయ్యాలనుకోడమే పొరబాటు...పాముకు పాలుపోసి పెంచినట్లు!...మధ్య నీకెందుకు అనవసరంగా. వాడు నీ పరువుకూడా తీస్తాడు ...పెద్దవాడ్ని చెబుతున్నా నామాట విను... వాడ్ని రేపట్నుంచి రావద్దని చెప్పేయ్... లేకుంటే వాడు యింట్లోతిని యింటి వాసాలు లెక్కపెట్టే రకం...నిన్ను నానా అల్లరీ చేస్తాడు!.'

శంకరంగారు అప్పటికీ మాట్లాడలేదు ...ఇక తను వచ్చినపని అయిపోయింది కాబట్టి...'వస్తానోయ్. శంకరం...' అంటూ బయలుదేరారు వరదరాజులుగారు. ఇప్పటికి ఆయనకు తృప్తిగా వుంది 'లేకుంటే తనంతటి వాడ్ని పట్టుకు అలా గోలచేయించి, పేర్లుపెట్టి, పైగా కాపీ పట్టుకున్నాడని తన 'బాచి'ని తెచ్చి హుఁ... వరదరాజుల పగ అంటే పాముపగ లాంటిదని తెలియాలి వేణుకు... తనతో విరోధం పెట్టుకోడం సర్వనాశనం కోరి తెచ్చుకోడమేనని బాగాతెలిసి రావాలే..' అనుకుంటూ నడుస్తున్న వరదరాజులు గారికి చదువుకోడానికని వచ్చిన వేణు వరదరాజులగారి గొంతువిని గేటుకవతలే నిలబడి పోయ్యాడని, శంకరంగారితో ఆయన చెప్పిన మాటలన్నీ విన్నాడనీ, యీాయన అంతేదో యివ్వాళే తేలుస్తానని పొగలుకక్కుతూ ప్రైవేటుకూడా మానుకుని యింటికి వెళ్లిపొయ్యాడని ఆయనకేం తెలుసు?...

* * *

వరదరాజులుగారు యింటికి చేరుకొన్నారు. రెండువాటాల యిల్లది. అందులో ఒకవాటాలో వరదరాజులుగారు అద్దెకుంటున్నారు. అందులో మూడేగదులు. గదులు కూడా ఏమంత పెద్దవికావు. ముందువైపు ఓ మంచం పట్టే వరండా. తర్వాత వరుసగా మూడుగదులు. నిజానికి ఆ యిల్లు వాళ్ళకి చాలదు. జీవనవ్యయం అధికమైన గుంటూరులాంటి వూళ్లో అంతకంటె ఎక్కువ అద్దెను ఆయన భరించలేదు.

ఇల్లు చేరుకోగానే ముందుగదిలో నున్న వంకెకు చొక్కా తగిలించారు. ఆ హాలు కూడా చిన్నదే. అందులో ఒకప్రక్కగా టేబిల్. దానిముందు ఎప్పటిదో పాతకుర్చీ. టేబిల్ మీద చిన్న రేడియో. దానిమీద దుమ్ముకొట్టుకున్న అలారం టైంపీస్. దాని చుట్టూతా పుస్తకాలు పడివున్నాయి. రేడియోపక్కన టేబిల్‌మీద పిల్లల పలకా బలపం, చినిగి పోయిన కాగితాలు వగైరాలు పడివున్నాయి. ఆ గదిలోనే ఒక ప్రక్క తలుపులులేని అలమారలో పిల్లల పుస్తకాలు గుట్టలా పడివున్నాయి. గోడలకు కాలెండరు ఫోటోలు. అన్నీ సినీతారల కాలెండర్లే. గోడలనిండా మేకులుకొట్టిన చిల్లులు. ఆయన పుత్రరత్నానికి ఎప్పుడు ఎక్కడ కాలెండరు తగిలించాలనిపిస్తే అక్కడే ఓ మేకుకొట్టి తగిలించేస్తాడు. అలా రోజుకు అధమం రెండు ఫోటోలైనా తగిలించడం అతడిహాబీల్లో ఒకటి. తలుపుల మీద సుబ్బారావు అని 'చాక్‌పీస్'తో వ్రాసివుంది. అది ఆయన జ్యేష్ఠపుత్రుని పేరు. ఇంట్లోవాళ్ళెవరైనా తనపేరు మర్చిపోతారేమోనని గాబోలు అతడలా అన్ని తలుపులమీద, కిటికీలమీదా వ్రాసి వుంచాడు.

వరదరాజులు చొక్కా తగిలించిన వంకె మీద యింకా రెండు మూడు మాసిన చొక్కాలు. మరో రెండు పంచలు, ఆయన పెద్దకొడుకు మాసిపోయిన పాంటు, ఒక మోస్తరుగా మాసిన షర్టు వున్నాయి. ఇస్త్రీ చాకలివచ్చిన్నాడే వాటి కక్కడినుండి మోక్షం! వరదరాజులుగారు చొక్కా తగిలించి లోపలకు వెళుతున్నవాడల్లా చటుక్కున వెనక్కువచ్చి ఇప్పుడు తగిలించిన షర్టు కాక యింతకు ముందు తగిలించిన షర్టు జేబులన్నీ వెతుక్కున్నారు. ఆయన ముఖం వివర్ణమైంది. ఆత్రుతగా అక్కడున్న చొక్కాల జేబులన్నీ వెతికి చూచారు. తర్వాత డ్రాయరు సొరుగు కూడా వెతికారు.

'సుబ్బారావ్!...సుబ్బారావ్!...' అంటూ గట్టిగా పిల్చారు.

జవాబు లేదు.

'ఒరేయ్! సుబ్బులూ!...' ఆయన కంఠం యిల్లంతా ప్రతిధ్వనించింది.

'సుబ్బులు లేడు నాన్నా...' అంత దాకా వాకిట్లో గోలీ లాడుతున్న నాలుగేళ్ల మూడోవాడు వచ్చి యిన్‌ఫర్మేషన్‌యిచ్చాడు. వాడి ఒంటికి మాసిన చొక్కా తప్ప మరో ఆచ్ఛాదన లేదు. ఆయన ఏడుమంది సంతానంలోనూ వాడు ఐదో సంతానం.

'ఎక్కడికి వెళ్లాడు వెధవ?...' అని అడిగారు వుగ్రరూపం దాల్చి.

'ఏమో!...' అనేసి తన కేమీ సంబంధం

లేనట్టు, వెళ్లిపోయ్యాడు వాడు. వరదరాజులుగారు వేరుగా వంట యింట్లోకి నడిచారు. అది కూడా చాలా చిన్న గది. ఆ గదిలోకి గాలి, వెలుతురు ఎటునుంచీ రావాలో తెలియక రావడమే మానేశాయి.

'ఆ వంకెన తగిలించిన చొక్కాలోంచి రెండు రూపాయలు ఎవరు తీశారు?' గడపట్లో నిలబడి ప్రశ్నించారు భార్య కమలమ్మగారిని.

'ఏమో! నాకేం తెలుసు?...' అని ఆవిడ సమాధానం. అసలే పొయ్యి ముండక తిప్పలు పడుతున్న ఆవిడ కస్సుమంది. ఆవిడ వయస్సు నిజానికి ముప్పయి ఐదు. కాని నలభై ఏళ్ల మనిషిలా కనబడుతుంది. జుట్టు సగం నెరిసింది. ఆ గదిలోనే చంటి వాడు ఒకటికి లోనేవడి దొర్లుతున్నాడు. ఎడపిల్ల సీసాలో ఆవాలన్నీ నేల పారబోసి తమాషా చూస్తోంది.

ఆవిడ కసురుతో వ్యగ్రత తగ్గిపోయిన వరదరాజులుగారు 'అది కాదే...నువ్వేమన్నా కావల్సివచ్చి తీసుకున్నావేమోనని...' అంటూ తేల్చేశారు.

'ఆఁ...నా ముఖానికి తోడు అది కూడా ఎందుకు? ... ఇంతోటి పెద్ద కలెక్టరు పెళ్ళాన్ని!...కట్టుకున్న పట్టు చీరెలు, పెట్టుకున్న సొమ్ములు ఎత్తిపోతున్నయి. ఇక డబ్బు లెక్కలేటే తక్కువ!...' అందావిడ దెప్పి పొడుపుగా. మాటకు ముందు అలా దెప్పి పొడవడం ఆవిడ కలవాటు.

'ఇప్పుడు కొనిపెట్టిన చీరల్ని యింత టక్కుగా వాడుతున్నావ్! ఏ చీరా మూడు నెలలకల్లా ముక్కలు ముక్కలు కావాలి గానీ యింక పట్టు చీరలే తక్కువయినయి, అందామని ఆయనకు నోటిదాకా వచ్చింది. కానీ అదేం ఖర్మో ఆవిడ ముఖం చూడగానే అవన్నీ పెదవులు దాటలేవు!

'సుబ్బులేమన్నా తీశాడేమో?...' అన్నారాయన.

'వాడికేంపని?...వాడెందుకు తీస్తాడు? మీరొరే ఎక్కడపెట్టుకున్నారో? ఎక్కడ వెతుకుతున్నారో?'...అని ఠకామని ఖండించింది ఆయన అనుమానాన్ని. ఆవిడ తన పెద్దకొడుక్కు కోరి తన తండ్రిపేరు పెట్టుకుంది. వాడిమీద ఈగవాలితే తన మీద డేగవాలినంత హడావుడి చేస్తుందావె. వాడుకూడా తన తండ్రిలాగే ఆఫీసరుద్యోగం చేస్తాడని ఆవిడ గట్టి నమ్మకం.

వరదరాజులుగారు కిక్కురుమనలేదు. అంతక్రితం ఒకసారి జేబులో చిల్లర మాయమైంది. సుబ్బులు రౌడీపిల్లలతో జేరి బీడీలు కాలుస్తున్నాడని ప్రైవేటులో కుర్రాడొకడు చెప్పాడు. ఆరోజు ఆయనకు చాలా కోపంవచ్చి సుబ్బులు వీపు విమానంమోత మోగించాలనుకున్నారు, కానీ కమలమ్మగారు మేరు పర్వతంలా అడ్డుపడింది. 'వాడంటేనే మీకు గిట్టదు. పోనీ మానాన్న పేరు పెట్టుకోడం మరంతగా యిష్టం లేకపోతే ఆ రోజే వద్దంటే సరిపొయ్యేదిగా?... చిన్నవెధవను సాధించి ఏం ప్రయోజనం? వాడిని చూస్తే అంతా కళ్లల్లో నిప్పులు పోసుకుంటారు...లేనిపోనివి ఎవరో కల్పించి చెప్పడం మీరు విని వాడిమీద పడడం బాగుంది...' అంటూ పది పదిహేనుమంది ప్రైవేటు కుర్రాళ్లముందు రభస చేసింది. అప్పటినుండీ సుబ్బులుకు అలుసెక్కువైంది. వాడు ఎక్కడ తిరుగుతున్నదీ ఏమి చేస్తున్నదీ ప్రైవేటు కుర్రాళ్లు చెప్పడమూ మానేశారు.

నిలబడివున్న వరదరాజులుగారి దృష్టి ఆవాలు పారబొయ్యడం అయి యిక కంది పప్పు పని పట్టబోతున్న ఎడపిల్ల మీద పడింది. 'చిట్టీ!...లే... లేముందు అక్కడి నుంచీ...' అంటూ ఆ కోపం యీ కోపం అంతా కలిపి ఒక్కటిచ్చారు వీపుమీద. అది చూచిన కమలమ్మగారు 'ఇదీ ఘనకార్యం! ఊరంతా తిరిగొచ్చి పెళ్లాం బిడ్డలమీదనే ప్రతాపం!... ఓ అచ్చటా ముచ్చటా ముద్దూ మురిపెం మా మొఖాలకి లేనేలేదు. పైగా కొట్టిచంపడం కూడా...ఆ మాయదారి దేముడు నన్నయినా పిల్చుకుపోడు...' అంటూ నుదురు కొట్టుకుంది కమలమ్మగారు.

ఆవిడ వాక్ప్రవాహం విన్న వరదరాజులుగారు నిశ్శబ్దంగా అక్కడినుండి తప్పుకున్నారు. మనసులో 'డబ్బువిలువ దీనికేం తెలుస్తుంది! సంపాదించే వాళ్లకు తెలుస్తుందిగానీ...' అనుకుంటూ.

నిజానికి వరదరాజులుగారికి జీతం కాకుండా ప్రైవేట్లమీద ఎంతలేదన్నా నెలకు రెండొందలు వస్తాయి. ఇల్లు గడవడానికీ భార్య మందులకూ వచ్చే జీతం చాలదు కనుకనే ఆయన పాతలావుతలమయి ట్యూషన్సు చెబుతున్నారు. ప్రొద్దున్న ఐదుగంటలకు నిద్రలేచి తనపనులు ముగించుకొని స్కూలుఫైనలు పిల్లలకు చదువు చెప్పడానికి కూర్చుంటే లేచేసరికి తొమ్మిది దాటుతుంది. ఉడుకుడుకు మెతుకులు రెండు నోట్లో వేసుకుని స్కూలుకు పరుగెడితే సాయంత్రం ఐదు గంటలకు యిల్లు చేరుకోడం. కమలమ్మగారికి కాస్త ఒంట్లో తేలిగ్గా వుంటే కాసిని కాఫీ పెట్టి వుంచుతుంది. లేకుంటే సాయంత్రం యింటికి రాగానే తనే ఇన్ని కాఫీనీళ్లు కాచి గొంతులో పోసుకుంటారు. సాయంత్రం ఆరు కాగానే ఫిఫ్త్‌ఫారం పిల్లలు, వాళ్లు వెళ్లగానే ఫోర్త్‌ఫారం పిల్లలు వస్తారు. ఇదీ ఆయన దినచర్య. ఇంత కష్టపడీ ప్రయోజనమేముంది!... ఇల్లుగల యిల్లాలికి పొదుపు మట్టసం లేకుంటే హాళ్ళకి హాళ్ళు... సున్నకు సున్న. ఎంతవున్నా లేనట్టే మరి. వరదరాజులుగారు స్వతహాగా మట్టసం మనిషే. కానీ ఆ మట్టసం జాగ్రత్త అనేది యింట్లో ఏ ఒక్కరికో వుండి ప్రయోజనం లేదు.

వరదరాజులుగారు తన పెట్టె తాళం తీసి అందులో పేపర్లు తీసుకుని మళ్లీ తాళం వేసుకున్నారు. వాటిని యివతల అవతల పడేస్తే తన సుపుత్రుల ప్రతాపం ఆయనకు తెలియంది కాదుగా!... అందుకే వాటిని భద్రంగా దాచుకున్నారు. ఆయన మనసులో మాత్రం యీ ఎండాకాలం రెండు నెల్లూ ట్యూషన్లు కూడా వుండవు ఎలాగా భగవంతుడా? డాక్టరు బిల్లే యాభై రూపాయల పైన అయింది. అనే ఆలోచన పరిభ్రమిస్తుంది...

డాక్టరు మాట తల్చుకున్నప్పుడల్లా ఆయన కెందుకో కష్టంగా వుంటుంది. ఆయన స్కూలు ఫైనలు ఫస్టు చాన్సులో పాసయినప్పుడు వాళ్ల నాన్న పొంగిపొయ్యాడు. "నా కొడుకులు చాలా దుక్కిదున్నుకు బ్రతకక్కరలేదు. ఒకణ్ణి డాక్టర్

చదివిస్తాను. ఇంకోడు ప్లీడర్ది చదువుతాడు. మూడోవాడు కలెక్టరు గిరీ చేస్తాడు.'' అంటూ అడిగిన వాళ్ళకూ అడగని వాళ్ళకూ సగర్వంగా చెప్పుకొన్నాడు. ఆయన చదివింది ఐదో క్లాసే. స్వంత కమతం పెట్టివున్న దాంతో సంసారాన్ని సాఫీగా నడుపుకొచ్చాడు. రెండెడ్లూ, బండీ, రెండుగేదెలు, వాకిట్లో వడ్లపురి, మహాలక్ష్మి తాండవిస్తూ వుండేది వాళ్ళయింట్లో. ఇన్నాళ్ళూ వూరికి నాలుగు మైళ్ళలో వున్న హైస్కూల్కి వెళ్ళి చదువుకునేవాళ్ళు పిల్లలు. ఇప్పుడు కాలేజిలో చేర్పించాలంటే పట్నం కాపురం పెట్టాలి. పోనీ పిల్లల్ని 'హోటేలు'లో ఏర్పాటు చేద్దామా అనుకున్నారాయన. కానీ కానీ ఆ తిండి సరిపడదేమోనని భయం! పైగా ఎన్నడూ ఒంటరిగా వుండడం అలవాటులేదు. దిగులు పడతాడేమోనని భయం. గొడ్లూగోదా తెగనమ్మేసి, యింటో ముట్టాలను కాపురముంచి, పొలం మక్తాకు యిచ్చి పట్నం చేరాడు. పాలూ, పెరుగూ దగ్గర నుండి, కొత్తిమేరకట్ట దాకా కొనుక్కోవాల్సిన పట్నంలో వచ్చే సుక్కా చాల్లేదు. గడ్డ పెరుగూ, నేతి సోపులూ అలవాటయిన వాళ్ళకు నెయ్యి వాసన చూసుకు కాలం గడపాల్సిన పట్నంలో ఆరోగ్యం దెబ్బతిన్నది. అయినా ఆయనకు కొడుకు భవిష్యత్తు మీద నమ్మకం మాత్రం పోలేదు. ఓ ఎకరం పొలం అమ్మేసి కొడుకుని చదువుకు పెట్టాడు.

వరదరాజులు కూడా మెడిసిన్ చదవా లని వుబలాటంగా వుండేది. స్టెతస్కోపు తిప్పుకుంటూ కారులో రౌండ్సుకి వెళ్ళడం లాంటివి చాలాసార్లు కల్లోకి వచ్చాయి. 'కన్సల్టేషను ఫీ' ఎంత తీసుకుంటే బాగుంటుందో కూడా ముందే నిర్ణయించుకు పెట్టేసుకున్నాడు. తను డిస్పెన్సరీ పెట్టగానే తన దగ్గరకు వచ్చిన రోగులు ఏ ఏ రూల్స్ పాటించాలని ఆదేశించాలో కుడా ముందే ఆలోచించి పెట్టుకున్నాడు. ఒక రోజు కాలేజికి వెళ్తుంటే వేపచెట్టు క్రింద చిలక జోస్యుడు కనిపించాడు. వెంటనే ఒక అణా యిచ్చి జ్యోస్యం అడిగాడు. 'అబ్బాయి! ఏం వుద్యోగమో కానీ ఎప్పుడూ పిల్లల మధ్యవుండే వుద్యోగం చేస్తావు అని చెబుతోంది మా చిలుక.' అని చెప్పాడు విభూతి రేఖల జోస్యుడు. వరదరాజులు వుప్పొంగిపొయ్యాడు. ఇంకేం తను మెడిసిన్ చదవడం ఖాయం. అందులో తను పిల్లల జబ్బులకు సంబంధించిన దాంట్లో (పెడియాట్రిక్స్) ప్రత్యేక శిక్షణ పొందాలని అనుకుంటూనే వున్నాడు. 'చిల్డ్రన్స్ నర్సింగ్హోమ్' పెడితే తను తిరిగేది పిల్లల మధ్యనేగా...పాపం చక్కగానే చెప్పాడనుకొని మరో అణా బహుమానంగా యిచ్చి వచ్చాడు. ఆ రోజు కాలేజికి చేరిన వరదరాజులు బయాలజీ ప్రాక్టికల్లో 'ఫ్రాగ్ డిసెక్షను'లో 'డార్సల్' ఓపెన్ చెయ్యబోతుంటే ఒక్క నిముషం ఆ కాలేజి 'లాబ్' మెడికల్ కాలేజి అనాటమీ హాలులానూ, మరో క్షణానికి అది తన హాస్పిటల్లోని 'ఆపరేషను థియేటరు' లానూ అనిపించి పైపొర జాగ్రత్తగా ఓపెన్ చెయ్యాల్సింది లోపలికంటా దించేశాడు. డిమాన్స్ట్రేటరు వచ్చి తిట్టాక గాని తెలియలేదు అది కాలేజి 'లాబ్' అని.

ఇలా కలలు కనేది ఒక్క వరదరాజులే కాదు. ప్రతి యువ హృదయమూ తన భవిష్యత్తును గురించి అలాగే కలలు కంటుంది. ఆ కలలు సఫలం కావడానికి కృషి, ఆర్థికస్తోమత, అన్నిటికంటె ముందు అదృష్టం కలిసిరావాలి. ఇందులో ఏది లోపించిందో చెప్పలేము గాని వరదరాజులు యింటర్మీడియేట్ తప్పాడు. ఆయన తండ్రి మాత్రం 'ఈ వూరి నీళ్ళు పడలేదు. ఎప్పుడూ నలతగావుంటే ఏం చదివాడు పాపం' అని సమాధాన పర్చుకున్నాడు. ఆ ఏడు కుప్పలు ముందుగా కొట్టి యింట్లో పోసుకున్న కౌలుదార్లు పంటలు సరిగా పండలేదని బకాయిలు పెట్టారు. బంగారం లాంటి పొలం పండలేదంటే ఆయనకు కష్టమనిపించింది. పట్నం కాపురం ఎత్తేస్తే బాగుండు ననిపించింది కూడా. కానీ చదువు మధ్యలో ఆపేసి వూరు చేరితే నలుగురూ నవ్వుతారని అలా చెయ్యలేదు.

మరుసటేడు పరీక్ష పాసయ్యాడు వరదరాజులు. కానీ విశ్వప్రయత్నం చేసినా మెడికల్ కాలేజిలో సీటు దొరకలేదు. కృంగిపోయిన వరదరాజులు బి. ఎ. పూర్తి చేసేసరికి సగానికి సగం ఆస్తి కరిగిపోయింది. తమ్ముళ్ళ చదువుతో మిగిలిందీ పూర్తయింది. వరదరాజులు బి. ఇడి. పూర్తి చేసేసరికి తండ్రి కన్ను మూశాడు. తమ్ముళ్ళను పై చదువులు చెప్పించలేక ఒకడ్ని తాలూకాఫీసులో గుమాస్తాగానూ, యింకోడ్ని షావుకారు గుమాస్తాగానూ చేర్పించాడు.

గతించిన రోజులు, నెరవేరని తన ఆశలూ తల్చుకుంటే వరదరాజులుగారికి జీవితం వెక్కిరిస్తున్నట్టుగా అనిపించి బాధపడతారు. అలాంటప్పుడు ఆయన వీరభద్రావతారం దాలుస్తారు. క్లాసులో వుంటే పిల్లలు, ఇంట్లో వుంటే పాపాయిలూ సహజంగా ఆయన కోపానికి గురి అయ్యేవి. ఇప్పుడాయనకు డాక్టర్లంటే గిట్టదు. పైగా 'ఈ రోజుల్లో



# జీవన్ టోన్

గవర్నమెంటు రిజిష్టర్డు నెం. 218726



పత్రికలలో ప్రకటనచేసిన ఔషధాలను సేవించి, ఫలితాలను పొందని వారు అనేకులున్నారు. కాని జీవన్ టోన్‌ను కొనుక్కుని దానిని ఉపయోగించి ప్రయోజనం పొందండి. జీవన్ టోన్ కేవలం వనస్పతి కొవ్వు నుంచి తయారు చేయబడినది. జంతువుల కొవ్వు చేరుటవల్లనే ఈ అనుకోనటువంటి బలిష్టతకు కారణం అని కొందరు అనుకోవటం పొరపాటు.

## జీవన్ టోన్ గుణములు:

ఎంత మంచి ఆహారము తిన్నా ఎముకల పోగువలె, బలహీనంగా ఉండే వారు కొంతమంది ఉన్నారు. అట్టి వారికి జీవన్ టోన్ మంచి బలాన్ని, లావును, బరువును ఇస్తుంది. ఆకలి లేనివారికి మంచి జీర్ణశక్తి నిస్తుంది. ఇది బలహీనత, కాళ్లు చేతులు తేలిపోవుట, తలతిరుగుడు, రక్తహీనతలను పోగొట్టి, పరిపూర్ణమైన దేహారోగ్యాన్ని, పుష్టిని ఇస్తుంది. శరీరం ఎరుపుఛాయ పొందటానికి జీవన్ టోన్‌తో టొమాటోలు తీసుకోండి. ఆరోగ్యవంతులకు కూడ జీవన్ టోన్ మంచిది.

జీవన్ టోన్ తీసుకొన్నప్పుడు మీరు కొంత శరీరవ్యాయామం చెయ్యటం అవసరం. లేకపోతే మీ శరీరం అనవసరంగా లావెక్కుతుంది. కావలసిన బరువు, బలిష్ఠత చేరిన వెంటనే జీవన్ టోన్ సేవించడం నిలపడం మంచిది. స్థూలకాయులు జీవన్ టోన్ తీసుకొనటం మంచిదికాదు. అట్టివారు జీవన్ టోన్ తీసుకుంటే మేము బాధ్యులం కాము. స్త్రీలు బహిష్టుకాలంలో తీసుకొనగూడదు. ఇతర వివరాలు మందుతో పంపబడతాయి.

**వెల: 454 గ్రాములు. రూ. 10/-** (పోస్టు చార్జీలు అదనం)

## స్కిన్ లీమ్స్

యౌవ్వన సౌందర్యం కలిగియుండటం వరప్రసాదం. స్కిన్‌లీమ్స్ మీ చర్మాన్ని, మొటిమలు, స్ఫోటకపు మచ్చలు, వివర్ణత, కోతలు, శోభినుంచి కాపాడుతుంది. స్కిన్‌లీమ్స్ ముఖమందలి మడ్డి తొలగించిన తరువాత వాడవలయును. మీరు ఏ స్నోనుగాని, పౌడరును గాని వాడవచ్చును. స్కిన్‌లీమ్స్ ఒక కోర్సు రు. 12/-

# JOTHI HOSPITAL

Phone No. 440206

POST BOX No. 1413. 32, VENKATANARAYANA ROAD, MADRAS-17.

స్థానిక డాక్టరు: డాక్టర్ దామోదరం, M.A., I.A.D.S.

# “పూర్వాసంధ్యా ప్రవర్తతే...”

డాక్టర్లకు ఏం తెలుసోయ్. రోగం చెబితే మందిస్తూ వుంటారు. వీళ్ల దగ్గరకు వెళ్లే కంటే ఏ గచ్చాకో పుచ్చాకో తినడం నయం' అంటూ క్లాసులో పిల్లలకు వుచితంగా సలహాలు యిస్తుంటారు......

ఇప్పుడు పేపర్లు తీసుకున్న వరదరాజులు గారికి భార్యమీద, సుబ్బులుమీద వచ్చినకోపం యింకా తగ్గలేదు. దానికి తోడు ఆయన భగ్న మనోరథాలు తల్చుకునే సరికి మనసు మరీ కలత చెందింది. దిద్దడానికి కూర్చున్న ఆయనకు విసుగేసింది. ఒకపేపరు తీశారు... 'అలహాబాదు ఆంధ్రప్రదేశ్‌లో వుందిట!...ఇంకా నయం అమెరికాలో వుందనలేదు' అనుకుంటూ విసుగ్గా కొట్టేశారు. ఇంకోపేపరు తీస్తే 'ఇంటిగ్రల్ కోచ్' ఫ్యాక్టరీ కొచ్చిన్‌లో వుందని వ్రాశారు. ఇంకా నయం 'ఆంధ్రప్రదేశ్'లో అని వ్రాయలేదు' అనుకుంటూ వున్న కోపమంతా వినియోగించి దానిక్రింద అగిమి గీతగీశారు. కాస్తలో పేపరు చినిగిపోవల్సింది. విద్యార్థుల భౌగోళిక పరిజ్ఞానం మీద అంతులేని కోపమొచ్చిన ఆయన దానికి బాధ్యులెవరో మర్చిపోయి పేపర్ను విసిరి డ్రాయరుమీదికి కొట్టారు. అంతలోనే 'చీఫ్' గుర్తువచ్చి ఆ పేపర్లేమన్నా చినిగాయేమోనని చూసుకున్నారు...నిజానికి ఆ పేపర్లు దిద్దడానికి అప్పుడాయనకు విసుగేసింది. కానీ యిప్పుడున్న మానసిక పరిస్థితిలో యీ పనే వుత్తమమనిపించి మళ్లీ పేపర్లు తీసుకున్నారు. ఎందుకంటే యింట్లో యింకెవరిమీద ఆయన కోపం చూపించినా మళ్లీ 'రణభేరి' వినిపించక మానదు.

ఇలా కాదని వున్న వాటిల్లోకల్లా కాస్త బాగా వ్రాసినట్లు అనిపించిన పేపరు దిద్దడానికి తీశారాయన. క్లాసులో తెలివిగల కుర్రాడ్నిచూస్తే అభిమానం కలిగినట్లే, చక్కటి దస్తూరీ, ప్రశ్నలకు సరైన జవాబులూ వున్నపేపరు చూస్తే దిద్దేవాళ్లకు ముచ్చటేస్తుంది పేపరు తియ్యగానే 'రాష్ట్రపతి ముఖ్యమైన విధులు' జవాబు కన్పించింది. 'ఈ ఘనుడు కూడా వచ్చిన విదేశీయులకు స్వాగతం చెప్పుట రాష్ట్రపతి ముఖ్యమైన విధి అనలేదుగదా' అని చూశారాయన.

'దేశములో ఎన్నికలు జరిపించి అధిక సంఖ్యాక పక్షనాయకుని మంత్రివర్గమేర్పరుచుటకు ఆహ్వానించును. అతడి సలహాపై మిగతా మంత్రులను నియమించును...పార్లమెంటు ఉభయసభల సంయుక్త సమావేశములో ప్రసంగించును. పార్లమెంటును సమావేశ పర్చుటకును, వాయిదా వేయుటకును, లోక్‌సభను రద్దు చేయుటకును ఆయన కధికారములు కలవు. పార్లమెంటు సమావేశము కాని దినములలో ఆర్డినెన్సులను...' ఇలావుంది. వరదరాజులు గారి కోపం కొంచెంతగ్గి యీ కుర్రాడెవరో ఫర్వాలేదు అనుకున్నారు...

'మేష్టారూ!...' వాకిట్లో పిలుపు.

వరదరాజులుగారు చిరాగ్గా లేచారు. ఆయనకు ఎవరన్నా ఆ పేరుపెట్టి పిలిస్తే తనను వెక్కిరించినట్లు భావిస్తారాయన. తన వృత్తిమీద తనకే గౌరవంలేని వ్యక్తి, యిక దానికి న్యాయం ఎలా చేకూరుస్తాడనే ప్రశ్న ఇక్కడ అప్రస్తుతం. అసలదేమి తమాషానో మేష్టరునుకానీ డాక్టరునుగానీ అసలు నామధేయంతో ఎవరూ పిలవరు. ఇంట్లో ఆడవాళ్ల నడిగినా 'డాక్టరుగారు యింట్లోలేరు!..' 'మేష్టారు యిప్పుడే వస్తారు.' లాంటి జవాబులు వస్తాయి. దానికి కారణం ఒకటయ్యుండచ్చు. మిగతా వాళ్లకు ఆఫీసు వేళలు అయిపోగానే వాళ్ళ వ్యక్తిగత జీవితంతో యితరుల కొట్టే సంబంధం వుండదు. కాని డాక్టరు అలా కాదు. అర్ధరాత్రి, నిశిరాత్రి కూడా ఆయన విధిని ఆయనకు జ్ఞాపకం చేస్తూ రోగులు వస్తూనే వుంటారు యిల్లు వెతుక్కుంటూ. ఇక మేస్టరూ అంతే. ఆయన వేష భాషలు, మాటా మర్యాదా, వ్యక్తిగత జీవిత ప్రభావం విద్యార్థుల మీద వుంటూనే వుంటుంది. అదేకాదు 'వైద్యోనారాయణో హరిః' అంటారు. 'ఆచార్యదేవోభవ' అంటారు. మనిషి యొక్క శారీరక వ్యాధిని వైద్యుడు నయం చెయ్యగలిగితే, విద్యార్థుల లేత మనస్సుల్లో కలుషితాల్ని పోగొట్టి, వారి మేధస్సు వికసించడానికి తోడ్పడేది, మానసిక స్వస్థత చేకూర్చేది వుపాధ్యాయుడే...

వరదరాజులుగారు నెమ్మదిగా వాకిట్లోకి వచ్చేసరికి తలుపు పక్క నలుగురైదుగురు కుర్రాళ్ళు నిలబడి వున్నారు. అసలే చీకటి చిక్కబడుతున్నవేళ. దానికితోడు మ్యునిసిపాలిటీవారి 'వాలంటరీ బ్లాకవుట్' పుణ్యమా అని వీధిలో ఎక్కడా దీపాలులేవు. ఆ చీకట్లో వాళ్లెవరో గుర్తుపట్టలేక పోయారు వరదరాజులుగారు. అందుకని

'ఎవరయ్యా ఏంకావాలి?...'అని,అడిగారు.

'ఎవరా!... నేను వేణును...' అన్న జవాబు విని ఆయ గడగడ వణకారు. ఈ రౌడీవెధవ యీ వేళప్పుడు, యింతమందితో సహా ఎందుకు వచ్చినట్లు?...' అనుకుని నిలువెల్లా వణికి పోయ్యారు.

'ఏం వోయి . వేణూ!... ఇలా ... వచ్చావ్?...' అని అడిగారు మాటల్లో ఆప్యాయతను తెచ్చిపెట్టుకుని.



# పూర్వాసంధ్యా...

'శంకరం మేషారింటికివెళ్ళి ఏంచెప్పొచ్చావ్?...' వేణు స్వరం కటువుగావినిపించింది.

'అబ్బే...నే...నా?...నే...అసలు...వెళ్ళలేదే?...' వరదరాజులుగారు తొట్రుపడుతూ జవాబిచ్చారు.

'వెళ్ళలా?... నిజం చెప్పు... శంకరం గారితో వేణును గురించి ఏం చెప్పావ్?...' మరో అతడు ముందుకొచ్చి సూటిగా ప్రశ్న వేశాడు.

'నేను...ఏం...చెప్పలే... దే... ఎవరు ... ఎవరు చెప్పారు?...'

'జాగ్రత్త!...నన్ను గురించి...శంకరం గారితో గానీ మరెవ్వరితోగానీ ఏం చెప్పినా, నా పేరు ఎత్తినా, నా జోలికి వచ్చినా... తెలుసుగా...మన సంగతి?...' వేణు హెచ్చరిక చేశాడు.

'అబ్బే...నాకు... నాకెం...పనయ్యా... ఎవరెలా పోతే...నాకెందుకు?...' నెమ్మదిగా కూడదీసుకుని అన్నారాయన.

'ఈసారికి 'వార్నింగ్'తో వదిలిపెడుతున్నాం...ఈసారి మావాడి మీద దుష్ప్రచారం చేసినట్లు తెలియాలి!...మన తడాఖా తెలుసుగా?...జాగ్రత్త...' అంటూ మరోమారు హెచ్చరించికుర్రాళ్ళందరూ వెళ్ళిపొయ్యారు.

'హమ్మయ్య!...ఈ రోజు గండం గడిచింది....అయినా వీడికెట్లా తెలిసిందబ్బా?' అనుకుంటూ మొఖాన పట్టిన చెమట తుడుచుకుంటూ లోపలికి వెళ్ళిన వరదరాజులుగారికి 'ఇంకెట్లా తెలుస్తుంది వీడికి! ఆ శంకరమే చెప్పుండాలి' 'ఆ వరదరాజులు యిట్లా చెప్పాడని.' తను ఏదో చెబితే అది వెళ్ళి ఈ రౌడీ వెధవ చెవులో వూది యింటిమీదికి పంపుతాడూ ఆహా శంకరం!... హాఁ!...ఈ వరదరాజులంటే ఏమిటనుకుంటున్నాడో?...ఈ శంకరం పని పట్టకపోతే నా పేరు వరదరాజులు కాదు...నా యింటి చుట్టూ తిరగాలి శంకరం, 'నాకు సాయం చెయ్యమంటూ' ... నలుగురు కుర్రాళ్ళ చేతిలో వుండగానే చాలనుకున్నావ్ గాబోలు... నీ జుట్టు మా చేతిలో వుంది...ఎక్కడికి పోతావో చూస్తాను...' అంటూ స్వగతంలో ప్రతిన బూనారు వరదరాజులుగారు.

(ఇంకా వుంది)



# పెద్ద పెద్ద ఆశయాలున్నాయి
# ఉత్సాహముంది
# వృద్ధిలోకి వస్తున్నాడు
# అతడి సైకిలు ఫిలిప్స్

ఫిలిప్స్ దిట్టంగా ఉంటుంది ఎంత చెడ తొక్కినా తట్టుకొనేటట్టు మంచి ట్రూ టెంపరు స్టీలుతో తయారైంది. దాని అంద చందాలు గంభీరత కూడా మీ సంస్కృతిని బాగా తెలియజేస్తాయి. మీవంటి యువకులకు తయారుచేయబడిన విశిష్టమైన బైసికిలు.

ఫిలిప్స్ మీరు వాడదగిన సైకిల్






®

జె.ఎ. ఫిలిప్స్ కంపెనీ లిమిటెడ్ యు.కె. వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కులు. ఇండియాలో తయారుచేయువారు: టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు, మద్రాసు-53 ప్రొప్రైటర్లు: ట్యూబ్ ఇన్వెస్ట్మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు-1 ఉపయోగించుటకు రిజిస్టరు కావింపబడినవి, చిన్న మొత్తముల సేకరణలో ఆదా చేయండి.

T.I.C/P/3820a

## ® ఫిలిప్స్

# అభినవ కురుక్షేత్రంలో ఇంగ్లీషు అర్జునుడు

'జేమ్స్ బాండ్' నవలలంటే కీ.శే. జాన్. ఎఫ్. కెన్నెడీకి చాలా ఇష్టంట. ఒకసారి రచయిత అయాన్ ఫ్లెమింగ్‌ని తన అతిథిగా కూడా పిలిపించుకున్నాడట. 'బాండ్' నవలలోని ఆకర్షణ ఏమిటి? ఇది తేలికగా సమాధానం ఇవ్వతగ్గ ప్రశ్నకాదు. ఒక ప్రఖ్యాత బ్రిటిషు విమర్శకుడు బాండ్ పుస్తకాలలోని 'స్నాబ్ క్రేవింగ్' (దీనిని 'తృష్ణా విడంబనం' అని ఒకరు చక్కగా అనువాదం చేశారు) పగటి కలలకి బాగా తోడ్పడుతాయన్నారు. అందంగా ఉన్న ఆడవారిని లోబరుచుకొనటం — అందులోనూ శత్రువుల వయిపు ఉన్న ఆడవారిని! – మంచి మంచి హోటళ్ళలో, ప్రపంచంలో ఎన్నో నగరాలలో భోజనాలు చెయ్యటం, వేగంగా వెళ్ళే కార్లలో తిరగటం, ఖరీదయిన వస్తువులని వాడటం, 'చెడ్డ' వారిని కసిదీరా చంపటం— ఇవన్నీ అందరికీ ఏదో విధంగా వచ్చే కల్లవలే. కాని, మాల్కమ్ మగ్గరిడ్జ్ చెప్పినట్లు బాండ్ బతికే 'అభిజాత్య జీవనం' అంత అభిజాత్య గుణాలు కలది కాదు. బాండ్ పెద్దవీరుడు కాకపోవటమే కాక తన అధికారి 'ఎమ్' పట్ల అతివినయంతో ప్రవర్తిస్తాడు కూడా! గూఢచార వృత్తిలో ఉంటూ ఉన్న అందమయిన ఆడపిల్లలు కూడా నమ్మలేనంత అమాయకంగా ఉంటూ ఉంటాడు !!

బాండ్ నేడు ఒక 'అంతర్జాతీయ చిహ్నం' అయిపోయాడు. అతని సినిమాలు బాండ్ పాత్రని వ్యంగ్యంగా హేళనచేసినా విరగబడి చూస్తున్నారు జనం. బాండ్ చొక్కాలు, శ్వరాలూ కూడా పేటెంట్ అయ్యాయి! ఇక బాండ్‌ని వెక్కిరించే సాహిత్యానికి అంతులేదు. నిజానికి రచయిత అయాన్ ఫ్లెమింగ్ చక్కటి ఇంగ్లీషు రాస్తాడు, అంతే అనే అనుమానం మాత్రం పాఠకులకి మిగులుతుంది!

జేమ్స్‌బాండ్‌ని గురించి ఎందరో ఎంతో రాశారు. శ్రీ టాక్జ్నిటాస్కి ఈ క్రింది వ్యాసంలో తమ అభిప్రాయాలు కొన్నిటిని వెలిబుచ్చుతారు. సం.]

* * *

జేమ్స్‌బాండ్ దీపం లండన్, అమెరికాలలో ఇంకా వెలుగుతూనే ఉంది. ఈ మధ్యనే విడుదల అయిన 'కాసినో రాయూల్' అనే సినిమా (ఆ పేరుగల అతని పుస్తకం ఆధారంగా తీసినది) ఈ దీపానికి మరికొంత నూనె పోసినట్టయింది! బ్రిటిషు సాహిత్య వర్గాలలో ఒక కొత్త వివాదం బయలుదేరింది. 'ఫ్లెమింగ్ 'సరుకు' ఉన్న రచయితా? లేక బాగా డబ్బులు చేసుకున్న సాహసకృత్యాల నవలల రచయితా? బాండ్ దేనికి చిహ్నం? వట్టి లోతులేని మనిషేనా? మాంచెస్టర్‌లో ఇంగ్లీషు ప్రొఫెసరుగా ఉంటున్న కింగ్ స్లీ ఆమిస్ బాండ్ అసలయిన జానపద నాయకుడు, అంటాడు. సినిమాలలో అతన్ని హేళనచేసి చెడగొట్టా రంటాడు ఆయన.'

ఫ్లెమింగ్‌ని పొగడేవారుంటే, తెగడే వారూ లేకపోలేదు. ప్రతివారిలోనూ దాగి ఉన్న 'దొంగచాటు ప్రేక్షకు'డి తుచ్ఛమయిన కోరికలని బాండ్ తీరుస్తాడని జాక్వెస్ బార్జున్ అంటాడు. మరికొందరు బాండ్ నీగ్రో, చైనీస్ జాతుల ఆడవారితో సంబంధాలు పెట్టుకుంటాడు కాబట్టి కొందరిని ఆకర్షిస్తాడంటారు.

ఆన్‌బాయిడ్ అనే ఒక అమెరికన్ వనిత ఫ్లెమింగ్ రచనలలో మంచి—చెడులమధ్య సంఘర్షణ 20 శతాబ్దానికి తగినట్లు చూపబడి ఉంటుంది—అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించింది. ఫ్లెమింగ్ ఈ సంఘర్షణని బుద్ధిపూర్వకంగానే చిత్రించాడని ఆమె నమ్మకం.

బాండ్ నవలలలో ఉపదేశం ఉంటుందిట. అతని పదమూడు పుస్తకాలూ ఒక అభినవ 'భగవద్గీత'తో సమానంట! జేమ్స్‌బాండ్ అర్జునిడితో సమానమయినవాడయితే, అతను ఎదుటివారితో పోరాడిన ప్రదేశాలన్నీ కురుక్షేత్రంతో సమానమయినవిట! అతని పుస్తకాలలో వచ్చే పాత్రల పేర్లు కూడా చాల వ్యంగ్యంగా ఉంటాయని ఆమె అంటుంది.

ఒక ఆసియాదేశం వాడినిగా పై గందరగోళానికి నా గొడవకూడా కలుపుతాను. అయాన్ ఫ్లెమింగ్ 'సండే టయిమ్స్'



పత్రికకి విదేశశాఖ సంపాదకుడుగా ఉంటున్నప్పుడు అదే సంస్థలో నేనూ పనిచేస్తూ ఉండేవాడిని. అప్పుడు ఆయనతో కొంత పరిచయం కలిగింది. ఫ్లెమింగ్‌కి రాజ

## ...ఇంగ్లీషు అర్జునుడు





కీయాల విషయంలో తేలికగా అర్థం అయ్యే సిద్ధాంతాలు కొన్ని ఉండేవి. 'ప్రపంచంలో రెండు రకాలవాళ్ళు ఉండేవాళ్ళు—మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు. హద్దు విరొధనంత సేపూ, విదేశీయులు ఫరవాలేదు. ఆఫ్రికన్ దేశాలకి స్వాతంత్ర్యమా? అర్థం లేనిమాట! ఆస్తి అనేది పవిత్రమయినది. ప్రభుత్వం ఇందులో కలుగచేసుకోనటం పాపం. పెట్టుబడిదారీ వ్యవస్థ అత్యుత్తమమయినది. ప్రచ్ఛన్న యుద్ధంలో తటస్థ విధానం నిజాయితీ ఎంత తక్కువ అయిపోయిందో తెలుపుతుంది—ఇటో, అటో తేల్చుకోనటమే ఉత్తమం.' బాండ్—నవలలన్నీ ఈ సిద్ధాంతాలని ఆధారంగా చేసుకుని రాసినవే. (ఒక దాంట్లో, సిలోన్‌లో పెట్రోలు వ్యాపారం జాతీయం చెయ్యటానికి కారణం అక్కడి ప్రభుత్వం కమ్యూనిస్టుగా మారటమే, అని ఉంది!) 'మంచివాళ్ళు' అందరూ పాశ్చాత్యదేశాలలో ఉండేవారు. రష్యన్లు అందరూ దుష్టులు. 'స్మెర్ష్' సంస్థ సభ్యులు చంపితే పాపం, బాండ్ చంపితే మంచికోసం. 'ఆంగ్లో సాక్సన్' దేశాలలో పవిత్రమయిన వ్యవస్థ అన్నిటినీ బాండ్ కాపాడుతూ ఉంటాడు, ఎన్నో గొప్ప ప్రమాదాలని ఎదిరించి. పాపమంటే ఏమిటో ఎరుగని ఈ పుణ్యాత్ముడు ఎన్నోసార్లు మృత్యు ముఖాన్ని చూస్తాడు. కాని, అతన్ని ఆఖరిక్షణంలో రక్షించిన వ్యక్తి ఎవరు? అమెరికన్ ఏజెంటు శ్రీ ఫెలిక్స్ లెయిటర్! ప్రచ్ఛన్నయుద్ధం తగ్గిపోతుందని గ్రహించిన తర్వాతనే ఫ్లెమింగ్ బాండ్—పుస్తకాలు రాయటం మానాలని నిశ్చయించుకుని ఉంటాడని నా అభిప్రాయం. రష్యన్ రాక్షసుడు క్రమంగా బాగుపడటం ప్రారంభించాడు. ఆ రాక్షసుడిబదులు మరొక రాక్షసుడిని సృష్టించవలసి వచ్చింది. ఈ కొత్త రాక్షసుడి ముఖం వేరుగా ఉంటుంది. అతని నివాసం ఆసియా, ఆఫ్రికాలలో. ఈ ప్రాంతాలు బాండ్ సుఖజీవనానికి అనువుగా ఉండవు. అందుకనే 'కాసినో రాయాల్'లో 'ఉత్త' జేమ్స్‌బాండ్ 'సర్' జేమ్స్ బాండ్‌గా మారిపోతాడు. అతని పని అయిపోయినట్లే లెక్క.

—టార్జీ విటాచీ షో. వ. ఫి.




LIFEBUOY
for health

# అవీ - యివీ...

## వివాహం

ఆంధ్రసచిత్ర వారపత్రికలో ఉప సంపాదకులుగా పనిచేస్తున్న శ్రీ సి. కనకాంబరరాజుకు చి. సౌ. సత్యవతికి తూర్పుగోదావరి జిల్లాలోని పోతవరంలో ఈనెల 12 వ తేదీన వైభవంగా వివాహం జరిగింది.

## మైసూరులో ఆంధ్రసాంస్కృతిక సమితి

మైసూరు నగరంలోని రిసెర్చి లేబరేటరీలు విద్యాసంస్థలు, విశ్వవిద్యాలయం వీనిలో పనిచేస్తూ ఉన్న ఆంధ్రులు మార్చి 5 వ తారీఖున "ఆంధ్ర సాంస్కృతిక సమితి"ని స్థాపించిరి. ఈ సంస్థకి అధ్యక్షులు డాక్టరు శొంఠి సూర్యనారాయణరావు గారు, కార్యదర్శి కె. విద్యాసాగర్ ఎన్నికైరి.

మొట్టమొదటి సారస్వత కార్యక్రమం ఉగాది రోజున మైసూరు విశ్వవిద్యాలయపు సంగీత నృత్య కళాశాల భవనంలో ఏర్పాటు చేసితిమి. చిరంజీవులు గబ్బిట రమ, సీత ప్రార్థన గీతం పాడిరి. డాక్టర్ శొంఠి సూర్యనారాయణరావుగారు, శ్రీ పైడిమర్రి శిత్యనారాయణగారు (రీజియనల్ కాలేజీ తెలుగు ప్రధానాధ్యాపకులు) ఉపన్యసించిరి. తదనంతరము శ్రీమతి స్నేహలతా సుబ్బారావు, చిరంజీవి సుశీలా వెంకోబారావు, శ్రీయుతులు వి. రామసుబ్బారావు శాస్త్రీయ సంగీతం, లలిత సంగీతం వినిపించారు. బృందగానంలో వీరితోపాటు హెచ్. కృష్ణమూర్తి, మంగిపూడి శాస్త్రిగారు, వారి సతీమణి పాల్గొనిరి.

పిదప శ్రీ రంగధామ్‌గారు యిటీవల రచించిన "ఆపదలో అబల" అనే నాటకాన్ని సంక్షిప్తరూపంలో ప్రదర్శించారు. హాస్య రస భరితమైన ఈ నాటికను ప్రేక్షకులు ఎంతగానో శ్లాఘించారు. నటన గూడ అద్భుతమైనదని సంగీత కళాశాల ప్రిన్సిపాల్ వి. రామరత్నంగారు కొనియాడారు. ఈ నాటకంలో పాల్గొన్నవారు శ్రీయుతులు బి. వెంకయ్య బి. మనోహరకుమార్, హెచ్. కృష్ణమూర్తి, డి. ఎస్. వి. సుబ్బారావు వి. రామసుబ్బారావు, శొంఠి రామారావు, జి. వి. సుబ్బయ్య, రాధాకృష్ణ రెడ్డి. జనగణమనతో సభ ముగిసింది.

ఈ కార్యక్రమం మైసూరులోని ఆంధ్రులను బాగా ఉత్తేజపరిచింది.

— శొంఠి వేంకట సూర్యనారాయణరావు.

## రెండు నాటికలు

మద్రాసు వాణీమహల్‌లో ఇటీవల 'మిణుగురు పురుగులు', 'దేవాంగపిల్లలు' అనే రెండు నాటికలను ప్రదర్శించారు. యమ్. ఏ. ఖాదర్, వై. ఏకాంబరం, యం. వి. శేషయ్య, సి. మల్లికార్జునరావు, టి. యన్. భూషణం, డి. పి. సత్యమూర్తి, శ్రీమతి విజయబాల వీటిలో నటించారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని చిరంజీవి ఉమా నృత్య ప్రదర్శన కూడా ఏర్పాటు చేశారు.

—సీతరాజు

## ఆంధ్రరాజధానీ నగరంలో నాటికల పోటీలు

హైదరాబాదులోని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాల నాటికల పోటీలు ఏప్రిలు 17, 18, 20, 21 తేదీలలో రవీంద్ర భారతిలో ఎక్కౌంటెంట్ జనరల్ ఆఫీసులోని తెలుగు నాటక సమితి ఆధ్వర్యంలో సంస్థ పదియవ వార్షికోత్సవ సందర్భమున దిగ్విజయంగా జరిగినవి. ఈ పోటీలలో 18 నాటికలు ప్రదర్శింపబడినవి.

నాలుగు రోజులు జరిగిన ఈ కార్యక్రమాలకు ఎక్కౌంటెంట్ జనరల్ శ్రీ పి. ఆర్. కాళే అధ్యక్షత వహించారు. తెలుగు నాటక సమితి అధ్యక్షులు శ్రీ యం. హనుమంతరావు అతిధులకు, పోటీలలో పాల్గొన్న వారికి స్వాగతం చెప్పారు. సమితి కార్యదర్శి శ్రీ యం. వి. రమణ నివేదికను సమర్పించారు. ఈ పోటీల సందర్భంగా సమితి వెలువరించిన సంస్మరణ సంచికను రాష్ట్ర రెవెన్యూ శాఖామాత్యులు శ్రీ వి. బి. రాజు ఆవిష్కరించారు. నాటికల పోటీకి ప్రారంభోత్సవం జరిపిన నటసామ్రాట్ శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, సభకు అతిధిగా విచ్చేసిన శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు తాము ఈనాడు సినిమారంగంలో వున్నప్పటికీ తమ ఈ స్థితికి కారణమైన ఔత్సాహిక నాటక రంగానికి ఎప్పటికీ కృతజ్ఞులుగా వుంటామని ఔత్సాహిక నాటకాల ద్వారా ఎంతో మంది కళాకారులను పైకి తీసుకు వస్తున్న తెలుగు నాటక సమితి కృషిని అభినందించారు.

మూడు రోజులు వివిధ నాటక ప్రదర్శనలు జరిగాయి.

బహుమతి ప్రదానం రాష్ట్ర నీటి పారుదల శాఖామాత్యులు శ్రీ శీలం సిద్దారెడ్డిగారు చేశారు.

సమితి సహాయ కార్యదర్శి శ్రీ సుబ్రహ్మణ్యం వందన సమర్పణ చేశారు. సమితి కోశాధికారి శ్రీ నాగేశ్వరరావు జాతీయగీతాలాపనతో నాలుగు రోజుల కార్యక్రమాలు విజయవంతంగా సమాప్తమయ్యాయి.

## కోల్ మైన్స్ ఆర్ట్సు ఎకాడెమీ

బెల్లంపల్లి (ఆం. ప్ర.) కోల్‌మైన్స్ ఆర్ట్సు ఎకాడమీ ఆధ్వర్యంలో ఇటీవల నాటక కళా పరిషత్తు ఏర్పరచ బడింది. మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు విజేతలకు బహుమతి ప్రదానం చేశారు.

(ఓ. వి.)



# ఒక్కొక్క కణంలో అమితోత్సాహం

ఓవల్‌టీనులో
శక్తినిచ్చే మాల్టు
అధికంగా ఉంది

ఓవల్‌టీనులో ఉన్నంత మాల్టు ఇతర ఆహారపానీయాలలో దేనిలో కూడా లేదు. ప్రకృతిలో శక్తిపుట్టించే వస్తువులలో మాల్టు సుప్రసిద్ధమైనది. అందుచేత, 1932 సంవత్సరంనుండి, ఓవల్‌టీను ఒలింపిక్ ఆటల అధికారుల సమ్మతం పొందిన ఒకేయొక ఆహారపానీయమంటే అందులో ఆశ్చర్యమేమీ లేదు.

ఓవల్‌టీనులో అదనపు మాల్టు మాత్రమే కాదు; ఇంకా పాలు, విటమినులు, శక్తినిచ్చే యితర పదార్థాలు కూడా చేరియున్నాయి. ఆకారణముచేత, సర్వోత్కృష్టమైన ఓవల్‌టీను పెరిగేపిల్లలకు, కష్టపడి పనిచేసే పెద్దలకు పనికివచ్చే ఆదర్శమైన ఆహారపానీయము.

ప్రతిరోజు ఓవల్‌టీను సేవించండి. ఓవల్‌టీను ఒక్కొక్క కణంలో అమితోత్సాహమిస్తుంది




## ఓవల్‌టీను త్రాగండి

(ఇండియాలో జగత్‌జిత్ డిస్టిల్లింగ్ అండ్ అల్లైడ్ ఇండస్ట్రీస్ లిమిటెడ్, ఎ. వాండర్ లిమిటెడ్, లండన్ వారి అనుమతితో ఓవల్టీను తయారు చేయుచున్నారు.)



మిస్. ఫెమినాగా ఎన్నికైన కుమారి ఆంటొనెట్‌కి, రన్నర్స్ అప్‌గా వచ్చిన కుమారి జెనిఫర్ స్టోరీ, కుమారి రాణీ ఆర్మ్ నికి బహుమతులనందజేస్తున్న మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి శ్రీ రామప్రసాదరావు.

ప్రముఖ ఆంగ్ల పక్షపత్రిక ఫెమినా, ప్రఖ్యాత అలంకరణ సాధనాలతయారీ సంస్థ జె. కె. హెలెన్ కర్టిస్‌వారు సంయుక్తంగా నిర్వహించిన, మిస్ ఫెమినా పోటీ మే 6 వ తేదీ సాయంత్రం మద్రాసులోని సఫైర్ థియేటర్‌లో జరిగింది. మద్రాసు, హైద్రాబాద్, బెంగుళూర్, లక్నో, కలకత్తా, బొంబాయి, ఢిల్లీలలో జరిగే మిస్ ఫెమినా ప్రాంతీయపోటీలలో ఎన్నికైన అమ్మాయిలలో ఒకర్ని మే 24 వ తేదీన బొంబాయిలో జరిగే పోటీలో మిస్ ఇండియాగా ఎన్నికచేస్తారు. మిస్ ఇండియాగా ఎన్నికైన అమ్మాయిని అమెరికాలో జరిగే 'విశ్వసుందరి' పోటీకి పంపిస్తారు.

మిస్ ఫెమినాగా ఎన్నికైన అమ్మాయికి ఫెమినా తరపున రు. 500 లు నగదు బహుమతి, జె. కె. హెలెన్ కర్టిస్ తరఫున కొన్ని ప్రత్యేక బహుమతులు లభిస్తాయి. 'రన్నర్స్ అప్'గా ఎన్నికైన తర్వాతి యిద్దరమ్మాయిలకు ఫెమినా రు. 250 లు, జె. కె. హెలెన్ కర్టిస్ బహుమతులను అందజేస్తారు.

మద్రాసులో జరిగిన ఫెమినా అందాల పోటీలో విల్లుపురానికి చెందిన కుమారి ఆంటొనెట్ అనే ఆంగ్లో ఇండియన్ అమ్మాయి 'మిస్ ఫెమినాగా' ఎన్నికైంది. ఈమె వయస్సు 20 సంవత్సరాలు. విల్లుపురంలోని ప్రభుత్వ కళాశాలలో విద్యాభ్యాసం చేసింది. ప్రస్తుతం బిన్నీ కంపెనీలో సెక్రటరీగా పనిచేస్తున్నది.

పోటీ అనంతరం ఆమె విలేఖరుల ప్రశ్నలకు సమాధానమిస్తూ తాను అందాల పోటీలలో పాల్గొనటం యిదే ప్రప్రథమం అనీ, మొదటిసారే తాను విజయం సాధించినందుకు ఎంతో ఉత్సాహంగా ఉందని, బొంబాయిలో జరిగే మిస్ ఇండియా పోటీలో ఎన్నికై అనంతరం అమెరికాలో జరిగే 'విశ్వసుందరి'పోటీలోకూడా విజయాన్ని సాధించాలని తానాశిస్తున్నట్లు చెప్పింది

'రన్నర్స్ అప్'గా వరుసగా కుమారి జెనిఫర్‌స్టోరీ, కుమారి రాణీ ఆర్మ్‌గం వచ్చారు

ఎయిర్ ఇండియా గ్రూప్ జనరల్ మేనేజర్ శ్రీ పి కె రాయ్, మద్రాసు కార్యాలయం మానేజర్ శ్రీ పట్టాభిరామన్, మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి శ్రీ రామప్రసాదరావు, జె కె హెలెన్ కర్టిస్ తరఫున శ్రీమతి మల్‌హోత్రా, మద్రాస్ షరీఫ్ శ్రీ మరుదైపిళ్లై, శ్రీమతి క్లబ్ వాలాజాదవ్ ఈ పోటీలో న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు.

ఈ పోటీతోపాటు ప్రముఖ వస్త్రాల తయారీ సంస్థలు, అంబికా సిల్క్ మిల్స్, సెంచరీ రేయాన్స్, గ్రేట్‌వే నిట్ వేర్, హకోబా ఎంబ్రాయిడరీస్, ఖటావ్ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ కో లిమిటెడ్, లీలాలేస్ స్కాటెక్స్ లిమిటెడ్, మఫత్‌లాల్ గ్రూప్ ఆఫ్ మిల్స్, మోడీ రేయాన్ అండ్ సిల్క్స్ వారు 43 రకాల ఫాషన్‌లను ఆరుగురు మోడల్ అమ్మాయిలతో ఆకర్షణీయంగా ప్రదర్శించారు.

—మాధవ్



ఆంధ్ర సంగీత నాటక ఎకాడమీ, ఆంధ్ర సంగీత సభల సమాఖ్యవారి ఆధ్వర్యమున యిటీవల విశాఖపట్నంలో జరిగిన ఆంధ్ర సంగీతోత్సవ ప్రారంభదినాన శ్రీమతి శ్రీరంగం గోపాలరత్నం ... శ్రీమతి వాలతీ పద్మనాభరావు, హైద్రాబాద్ (గాత్రం), శ్రీ ఎన్. సి. హెచ్. కృష్ణమాచార్యుల, విజయవాడ (వయొలిన్), శ్రీ ప్రొద్దుటూరి హనుమంతరావు, విజయవాడ (మృదంగం)

## స్టేట్ బ్యాంక్ సేవ నిమిత్తం

ఏచోటా స్టేట్ బ్యాంక్ ఆధునిక బ్యాంకింగ్ సౌకర్యములను
ప్రజలకు సమకూర్చుచున్నది. వారెచ్చటనున్నాసరే. ఈ నాడు
స్టేట్ బ్యాంక్ మరియు దాని అనుబంధ బ్యాంకులు దేశమంతటా
వ్యాపించియున్న 2100 బ్రాంచీలను కలిగియున్నవి: అన్నింటా
చేరి ఇప్పుడు ప్రస్తుత డిపోజిట్లు మొత్తం 1,200 కోట్ల
రూపాయలకు మించియున్నవి. ప్రజలు ఎచ్చటకావలెనంటే
అచ్చటకు వారికి మా సేవను సమకూర్చుచున్నాము. పరిశ్రమలకు,
వ్యవసాయమునకు చాలా ఎక్కువగా తోడ్పడుచున్నాము
మరియు మీకు చాలా ఎక్కువగా సహకరించుచున్నాము.
ఔను, స్టేట్ బ్యాంక్ మీ బ్యాంకే.

# ఎప్పటికీ సాగుచున్నది, ఎప్పటికీ పెరుగుచున్నది



LPE Aiyars S-263 TL



''గౌళశామ''లో యన్. టి. రామారావు, దేవిక



'చదరంగం'లో యన్. వి. రంగారావు



'పెట్టుకుంటే పదివేలు'లో చలం, గీతాంజలి.

# చిత్రలహరి

'మీ కేశ సంపదకు ఎల్లప్పుడూ ఆషా హేరాయిలే వాడండి!' అన్నాడు హీరో కృష్ణ. 'అదేమిటి?' అని అడిగాను కొంచెం ఆశ్చర్య పడి. 'అది అంతే! మీరు మట్టుకు తప్ప కుండా వాడండి!' అన్నది వాణిశ్రీ వెనకనే వచ్చి. 'మీ యిద్దరూ ఆషా హేరాయిల్ కంపెనీ ప్రతినిధులా ఏమిటి, కొంపదీసి!' అంటూ నవ్వాను. 'ప్రతినిధుల మేమిటండీ! ఆషా పెర్ఫ్యూమ్స్ అండ్ టాయిలెట్స్ కంపెనీకి ఆయన ప్రొప్రయిటర్. నేను ఆయన సెక్రటరీని.' అన్నది వాణిశ్రీ. ఈ కథ ఏమిటో అర్థం కాలేదు. ఇంతలో దర్శకుడు వాళ్లిద్దర్నీ షెట్‌లోకి పిలిచారు. నేనూ అనుసరించాను, వారిని.

* * *

చంద్రశేఖర్ బి. కామ్ (కృష్ణ) పెర్ఫ్యూమ్స్, టాయిలెట్స్ వ్యాపారం పెద్ద ఎత్తున ప్రారంభించాడు. వీటి ప్రచారం ముమ్మరంగా సాగించటంకోసం పబ్లిసిటీ ఆర్టిస్ట్ ఆనంద్ (శోభన్‌బాబు)ని నియమించాడు. తయారీదారుల ప్రతినిధులు వచ్చినవాళ్లు రాకుండా శాంపిల్స్ పట్టుకు రావడం—అడ్వాన్సులు తీసుకువెళ్లడం జరుగుతున్నవి. సరుకుల అమ్మకం మాట అటుంచి అతనివద్దనున్న పైకమంతా ముందు మంచి నీళ్లలా అయిపోయింది. చివరికి సెక్రటరీ. ఆషా (వాణిశ్రీ)కి డబ్బు బాకీ పడ్డాడు.

'నాకు రావలసిన డబ్బు మీ సూట్లు అమ్మి అయినా సరే యివ్వండి! రేపొద్దున్నే వస్తాను. గుడ్ బై!' అంటూ విస విసా నడచి వెళ్లింది ఆషా. 'ఆషా, ఆషా' అని చంద్రశేఖర్ బి. కామ్ అనుసరించబోయాడు గాని. ఆమె ఆ అవకాశం అతనికి యివ్వకుండానే గుమ్మం దాటి వెళ్లిపోయింది ఇంతలో గుమ్మంలో తమ్ముడు రాజా (పద్మనాభం) ఎదురుపడ్డాడు. అన్నగారి పరిస్థితి అతనికి అర్థం అయింది. ఇపు డతనున్న స్థితికి జాలిపడి 'అన్నయ్యా, తలమానె కంపెనీ కాస్తా చేతిచమురు భాగోతంగా మారిందా?' అడిగాడు రాజా. 'ఒరేయ్, ఎగతాళి చేయకురా. నా బిజినెస్ యివాళే దివాళా తీసిందిరా!' మెల్లిగా చెప్పాడు

# చిత్రలహరి

చంద్రశేఖర్… రాజుకి నాటకాల పిచ్చి. తన దగ్గరున్న డబ్బుతో నాటకాలు వేసి వేసి— తనే హీరో కూడా వేసి దెబ్బతిని, చెడి అన్నగారి దగ్గరకు వచ్చాడిపుడు. ఆ అన్న చంద్రశేఖర్ యింతకాలమూ తనెంతో తెలివైనవాణ్ణని అనుకున్నాడు. అతని సెక్రటరీ అప్పో ఏదైనా చెప్పబోయినపుడు 'నా పేరు చంద్రశేఖర్ బి.కామ్. ఆ మాత్రం నాకు తెలీదా? తెలివి లేదా?' అంటూ అతి తెలివికిపోయి దివాళా తీశాడు. 'నీ బిజినెస్ యివాళే దివాళా తీస్తే నేను మొన్ననే నెత్తిన కొంగేసుకున్నాను.' అన్నాడు రాజు. 'ఆ! నీ డబ్బుకూడా పోయిందా?' అడిగాడు తెల్లబోయి. 'ఉంటే నీదాకా వస్తానా?' అని నవ్వాడు రాజు. 'ఇంక యీ వూళ్ళో తలెత్తుకు తిరగలేంరా రాజూ! యిపుడేం చేద్దాం?' కర్తవ్యం బోధపడక అడిగాడు చంద్రశేఖర్. 'అసలు మనకు తల వుంటేగా, ఎత్తుకు తిరగడానికి?' ఎదురు ప్రశ్నించాడు రాజు. చంద్రశేఖరానికి నవ్వు ముండింది.



'శభాష్ రంగా'లో జయలలిత, ఎం. జి. ఆర్.



'ప్రాణమిత్రుల'లో నాగేశ్వరరావు

'పాతికవేలూ తగలేసి యిదా నువ్వు నేర్చుకుంది' అన్నాడు. 'అంతకు రెట్టింపు తగలెట్టి నువ్వు నేర్చుకుందేమిటి?' 'వెటకారం చెయ్యకురా, యిప్పుడేం చేద్దాం చెప్పు?' సలహాకోసం అడిగాడు తమ్ముణ్ణి. 'ముందు యింటికెళ్ళి కాఫీ తాగి, తాపీగా ఆలోచిద్దాం!' అన్నాడా తమ్ముడు రాజా.

* *

'కట్' అన్నారు దర్శకుడు పి. మధుసూదనరావు. వీనస్ పద్మినీ కంబైన్స్ వారు నిర్మిస్తున్న సాంఘిక చిత్రానికి చెందినదీ దృశ్యం. సగానికి పైగా పూర్తి అయిన యీ చిత్రంలో యస్. వి. రంగారావు, అంజలీదేవి, శోభన్‌బాబు, రామ్మోహన్, నాగయ్య, చదలవాడ, భారతి, విజయలలిత యితర ముఖ్యపాత్రధారులు. మాటలు, పాటలు: ఆరుద్ర, సంగీతం: కె.వి.మహదేవన్, కళ: యస్. కృష్ణారావు. రామమూర్తి అనే యువకుడు యీ చిత్రాన్ని ఫోటోగ్రాఫ్ చేస్తున్నారు. ఈయన మార్కస్ బార్ట్లే వద్ద సహాయకునిగా పనిచేసి చక్కటి అనుభవం గడించారు, శ్రీ రామమూర్తి తొలిసారిగా స్వతంత్రంగా ఛాయాగ్రహణ దర్శకత్వం వహిస్తున్న చిత్రం యిది. నిర్మాత: టి. గోవిందరాజన్, అసోసియేట్ ప్రొడ్యూసర్: టి. వి. యస్. శాస్త్రి. నవయుగ వారు యీ చిత్రానికి పంపిణీదారులు.

—మోహన్‌కుమార్

BENSONS/NGB-103F TEL

# మీ ప్రియతమ

"కొత్త పెండ్లికుమార్తెను కనుక నా తల్లిదండ్రులకు వ్రాస్తున్న ఈ ఉత్తరంలో నేను వివరించవలసిన విషయాలెన్నో వున్నాయి. నేను మెట్టిన ఇంటినిగురించి, నా యీ కొత్త ప్రపంచంగురించి, అంతేకాక, నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్‌లో మేము కొత్తగా ప్రారంభించిన సేవింగ్స్ బ్యాంక్ ఖాతాగురించి వ్రాయాలి. నిజంగా ఆ బ్యాంకువారు అంత స్నేహ పాత్రులు, నమ్మకస్థులు. నావలె కొత్తగా పెళ్లి చేసుకున్న వారందరూ కూడా ఆ బ్యాంకులో ఖాతాలు పెట్టాలని నా అభిప్రాయం."



మీరూ, నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంకు మంచి స్నేహితులవుతారు

## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడినది ● సభ్యుల బాధ్యత పరిమితం
(అసోసియేటెడ్ బ్యాంక్స్ ● లాయిడ్స్ బ్యాంక్ లిమిటెడ్ నేషనల్ ప్రావిన్షియల్ బ్యాంక్ లిమిటెడ్)

బ్రాంచీలు: మద్రాసు: 5, నార్త్ బీచ్‌రోడ్; 378, నేతాజి సుభాష్ చంద్రబోస్ రోడ్డు, (లాయిడ్స్ బ్రాంచి) 6, ఆర్మీనియన్ స్ట్రీట్; 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్: అబీద్ రోడ్.

చిత్రసమీక్ష:

## వీర ప్రతిజ్ఞ

శ్రీ తిరుమలా పిక్చర్స్‌వారు తమిళంలో విజయవంతమైన 'తాయ్‌మేల్ ఆణై' చిత్రాన్ని 'వీరప్రతిజ్ఞ'గా తెలుగులోకి అనువదించారు.

రసవత్తరమైన కథాసంవిధానంతో మామూలు ప్రేక్షకులను ఆకట్టుకోగల మాయలు, మంత్రాలు, యుద్ధాలు మొదలైన వాటితో ఆకర్షణీయంగా రూపొందింపబడినది. దర్శకుడు జి. ఆర్. నాథన్; మాటలు పాటలు: అనిశెట్టి, సంగీతం: నిజలింగప్ప, వేలూరి.

ఈ చిత్రంలో రాజశ్రీ, కె. ఆర్. విజయ, పుష్పవల్లి, బి. వి. రాధ, మనోరమ, ఆనంద్, నాగేష్, ఓ. ఎ. కె. దేవర్, మాష్టర్ బాబు మొదలగువారు నటించారు. నటీనటులందరూ చక్కగా నటించారు. పాటలన్నీ వినసొంపుగా ఉన్నాయి. ఆంధ్రలో రాయల్ ఫిలింస్, సీడెడ్ జిల్లాలలో జ్యోతి ఫిలింస్ వారిద్వారా ఈ చిత్రం విడుదల అయింది.

(ఓ.స.) ●

## మెదడుకి మేత

### జవాబులు

(జ) ఈ లెక్కలు అంకెలను మాత్రమే గుణించాం. ఆ అంకెలు సూచించే ప్రమాణముల జోలికి పోనేలేదు. అదిగో తప్పు అక్కడే ఉంది. నిజానికి—

2 శేర్లు × ½ శేరు = 48 తులాలు × 12 తులాలు అని గుణించి,

1 (శేరు)$^{2}$ = 576 (తులసులు)$^{2}$ అని వ్రాయాలి. కాని (శేరు)$^{2}$, (తులములు)$^{2}$ అనే మాటలకు అర్థం లేదు. అదే అడుగులు, అంగుళాలు ఉపయోగిస్తే ఈ గుణకారం అర్థవంతమై ఉండేది.

2 అడుగులు = 24 అంగుళాలు

½ అడుగు = 6 అంగుళాలు

రెండు వైపులా గుణిస్తే

1 చదరపు అడుగు = 144 చదరపు అంగుళాలు.

ఈ లెక్క సరియైనదే కదా!

(చ) పై జవాబే దీనికి వర్తిస్తుంది.

(ట) +5, −5 అనేవి రెండూ కూడా 25 కి వర్గమూలములే. వర్గమూలములతో లెక్కలు చేసేటప్పుడు ఋణ ధన సంజ్ఞలలో ఏది నప్పుతుందో చూచి దానినే ఉపయోగించుకోవాలి. ఈ సంగతి మరిచిపోతే ఇబ్బంది వస్తుంది.

(త) సున్నని సున్నచే భాగిస్తే వచ్చే సంఖ్య ఇదమిత్థమని చెప్పడానికి లేదు. ఏదైనా కావచ్చు. కనుక గణితంలో సున్నని సున్నచే భాగించడానికి ప్రయత్నించ కూడదు. ఈ పని చేస్తే ఊహించని వైపరీత్యాలు ఎన్నైనా ఎదురవుతాయి. ఈ లెక్కతో $x$ విలువ 10. కనుక $(4x-40)$ చే భాగించడంవల్ల సున్నని సున్నచే భాగించినట్లు అయింది. అదీ తప్పు!

(ప) $1^2 = 1$ అన్నది నిజమే కాని, $2^2 = 2$ కాదు కదా! ఇక్కడ జరిగినది అటువంటి పొరబాటే. రెండు మైళ్ల చదరం అంటే 4 చదరపు మైళ్లకి సమానం.

(గ) ఈ లెక్కలో $x = 2$ కనుక $(3x-6)$ పెట్టి భాగించడం వల్ల సున్నని సున్నచే భాగించినట్లు అయింది.

(జ) "ట" అనే సమస్యకిచ్చిన జవాబే ఇక్కడా వర్తిస్తుంది. $(4-6) = -(8-6)$ అని వ్రాయాలి. ●

## న్యూఢిల్లీలేఖ

(11 వ పేజీ తరువాయి)

ముసల్మాన్‌లు కన్పించకపోవడానికి ముఖ్య కారణం. డాక్టర్ హుస్సేన్ మరో విధంగా అంగీకరించదగినవారే. కానీ శ్రీమతి గాంధీ తమకున్న బలాన్ని ప్రదర్శించదలిచారు. అది ఆమె బలం కాదు. అది అవసరానికి ఉపయోగపడగలదన్న కాంగ్రెస్ బలం, కాంగ్రెస్ యింకా కలిసి కట్టుగా ఉందన్నదానికి నిదర్శనం.

శ్రీమతి గాంధీ, శ్రీ కామరాజ్‌లమధ్య, శ్రీమతి గాంధీ, డాక్టర్ రాధాకృష్ణన్‌ల మధ్య సంబంధాలు అంత బాగాలేవని అందరికీ తెలిసిందే. డాక్టర్ జాకీర్‌హుస్సేన్ శ్రీమతి గాంధీగారి ఎన్నిక కాబట్టి వారిద్దరిమధ్య చక్కని అవగాహన ఉంటుంది. ఈ ఊహ సరైనదైతే దేశానికి మంచిదే. డాక్టర్ జాకీర్‌హుస్సేన్ శ్రీమతి గాంధీగారి మార్గదర్శకుడో లేక చెప్పినదానికల్లా అవుననే 'రబ్బర్ స్టాంప్' రాష్ట్రపతో కాలమే నిర్ణయిస్తుంది. ●

# సువాసన మిమ్ము ఆకర్షిస్తుంది
# రుచి సంతృప్తిని చేస్తుంది-

## ఆస్వాదించండి

# బ్రూక్ బాండ్

## ఫ్రెంచ్ కాఫీ

అది పొదుపైనది
మీరు ఎక్కువ సంతృప్తిని
పొందటానికి కొద్దిగా
ఉపయోగిస్తే చాలు!






1 కిలోగ్రాము
మరియు
500 గ్రాముల
పొలిథిన్
ప్యాకెట్లులో
దొరుకును.






Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA